విసడమ్

సంపాదక వర్గం

సంపాదకులు

డా. కె.వి.గోవింద రావు

టి.వి.ఎస్.రావు

వి.బాలకుమార్

సభ్యులు

కె.వి.ఎస్.గోవింద రావు

కె.వి.ఎస్.శరత్ బాబు

కె.వి.ఎస్.విజయకుమార్

కె.రత్నకుమారి

చందా వివరాలు

| | |
|---|---|
| శాశ్వత చందా | 1000.00 |
| జీవిత చందా | 250.00 |
| 3 సంవత్సరాలకు | 52.00 |
| సంవత్సర చందా | 18.00 |
| ఎయిర్ మెయిల్ (సంవత్సరం) | 80.00 |
| సీమెయిల్ (సంవత్సరం) | 45.00 |

చందా పంపవలసిన చిరునామా:

విసడమ్

[illegible]

మద్రాసు-600 0[illegible]

# ఈ సంచికలో

జూలై 1985



★

ముఖచిత్రం-కలర్ ట్రాన్స్పరెన్సీ :
ఎస్. శివన్నారాయణ, మద్రాసు-17.

తెలుగు విసడమ్ కు ఇది [illegible] సంవత్సరం

## ధ్యానం

### దివ్య ప్రేమలో అందరూ సమానులే!



జేమ్స్ ఎలెన్

హృదయంలో దివ్యప్రేమ అంకురించి ప్రవృద్ధిచెంది వికసించినప్పుడు మానవులలో విభేదం కనిపించదు. అట్టి కరుణామయమూర్తి తన అభిప్రాయాలను, తన లక్ష్యాలను ఇతరులచే సమ్మతింప చేయడానికి ప్రయత్నించడు తాను నిర్వర్తించేదే సర్వోత్తమమైన ధర్మం అని ఒప్పింపజేయడు. దివ్య ప్రేమతత్త్వాన్ని పూర్తిగా తెలుసుకుని అచంచలమైన నిర్మల మనస్సుతో అందరిపట్ల శాంతిస్వభావంతో సౌజన్యంతో ప్రవర్తిస్తాడు. పాపాత్ములు,

(మిగతా 8 వ పేజీలో)

## సంపాదకుని పేజీ

### లేవండి! సిద్ధంకండి! నడుం బిగించండి!

అతి క్లిష్ట పరిస్థితులలో దిగ్విజయాన్ని సాధించిన ఒక వ్యక్తిని 'విజయం ఎలా పొందావు?' అని ప్రశ్నించినప్పుడు, 'ప్రతిది నామీదే ఆధారపడి ఉంది అనే దృఢ విశ్వయంతో ఉద్యమించాను. అంతా పరమాత్మనిపై ఆధారపడి ఉందని భగవంతుని ప్రార్థించాను' అని సమాధానం ఇచ్చారు.

గ్రుడ్లు పొదగడానికి తప్ప ఊరికే కూర్చుంటే ఏ పనులు కొనసాగవు. అది పక్షి చేసే పని. మరి మానవులు ఊరికే కూర్చుంటే ఏ కార్యక్రమాలు కొనసాగవు.

మనసుకూ శరీరానికి
శ్రమే బలం
చెయ్యాలని కూర్చుంటే

### విశ్వాసం సంతోషాన్నిస్తుంది

ఒకరిని విశ్వసిస్తే వారికి ఎంతో ఆనందం కలుగుతుంది. అతడి యోగ్యతకు ఇదే మనం యిచ్చే మెప్పు: అతడి గౌరవ ప్రతిష్ఠలకు ఇదే మనమిచ్చే మూల్యం: మనమీద అతడికి ఒక విధమైన హక్కు కలదనడానికి మనం ఇచ్చే ప్రతిజ్ఞ: మనం ఏర్పరచుకోగల ఒక నమ్మిక. —లారో చెఫోకాల్డ్

"ఒక్క మానవునికే జీవితం తీరని సమస్య: అది అతడే పరిష్కారం చేసుకోవాలి." —ఎరిక్ ఫ్రామ్

నెరవేరవు పనులు
నీటిలో చేపలుంటాయి
పటాలంటే
గాలం వేయాలి.




కాబట్టి సిద్ధంకండి, లేవండి, నడుం బిగించి కార్యసాధకులు కండి. మనీషుల జీవితాలను అధ్యయనం చేయండి. విజయాలను సాధించిన ఇరుగు పొరుగువారి ఆదర్శాలను గ్రహించండి. విజయం సులభసాధ్యం కాదు. కష్టాలకు ఓర్చి మహోన్నత పర్వత శిఖరాలను అధిరోహించిన వారిదే ఘనవిజయం. అన్నం తినాలి అని అనుకుంటే కడుపునిండుతుందా? దానికి తగిన ప్రయత్నాలు కొనసాగించాలి. ఉండడానికి ఇల్లు కావాలనుకుంటే ప్రయత్నం చేసి గృహం నిర్మించుకోవాలి. విజ్ఞానాభివృద్ధిని పొంది నైపుణ్యం సంపాదించాలంటే దానికి తగిన ప్రయత్నాలు చేయాలి. మానవుడు తన శారీరక శక్తితో, మానసిక శక్తితో సాధించిన సత్ఫలితాలనే అనుభవించగలడు.

ఒక్క క్షణంకూడా వ్యర్థం చేయని తేనెటీగ చివరి మకరంద బిందువును తీస్తూ మరణించడం దాని విధి. తరువాత పిల్ల తేనెటీగ బయలుదేరి మకరందాన్ని సేకరించడానికి ప్రారంభిస్తుంది.

జీవితం ఒక పందెం వంటిది. బలసత్త్వాలు ఉడిగి వృద్ధాప్యం మీదపడ్డప్పుడు మీ పిల్లలను మరింత శక్తి సామర్థ్యాలతో మీ పనులను కొనసాగించ నీయండి!



(2 వ పేజీ తరువాయి)

పుణ్యాత్ములు, అవివేకులు, వివేకులు, స్వార్థపరులు, నిస్స్వార్థపరులు అనే భేదం లేకుండా అందరికీ ఒకే అభయాన్ని ఇస్తాడు.

ఆత్మనిగ్రహంతో ఆత్మవిజయాన్ని సాధించినప్పుడే ఈ దివ్య ప్రేమతత్త్వం అనుభవంలోకి వస్తుంది.

"పిపాసువి దాహానికి జలము హితముగా మందుముగాని,

# ద్యా

ఎస్. వి.



[శ్రీమతి ఎస్. వి. శీల మద్రాసులో సంగీత సంస్థకు ప్రిన్సిపాలుగా ఉంటూ సంగీతశాస్త్రంలో అనేక ఆంగ్ల, తమిళ గ్రంథాలు రచించి పరిశోధన కావిస్తున్నారు.]

భారతదేశం అనేక రకాల సంగీత వాద్యాలకు ప్రసిద్ధిపొందింది. వివిధరూపాలతో, నిర్మాణాలతో సుమారు ఐదువందల రకాల వాద్యాలు ఉన్నాయి. వాదన విధానాన్ని అనుసరించి నాద వైవిధ్యం జనిస్తుంది.

ఇవి వేదకాలంలోనే ప్రారంభింపబడ్డాయి. ఆనాటి జయకరుడు దర్భగడ్డితో 'జయ' అనే వీణను కనిపెట్టాడు. ఇది భారతదేశపు ప్రప్రథమ తంత్రీవాద్యము అని చెప్పుకోవచ్చు. సాధారణంగా సంగీత వాద్యాలు వీణాది తంత్రీవాద్యము, మృదంగ వాద్యము, సన్నాయి మొదలైన సుషిర వాద్యము, తాళాది ఘనవాద్యము మొదలైనవి. వీటిలో మృదంగ వాద్యాలు చాలా ప్రాచీనమైనవి. వీటి తరువాత సుషిర వాద్యాలు అభివృద్ధిపొందాయి. చివరగా తంత్రీ వాద్యాలు కూడా వాడుకలోకి వచ్చాయి.

వీటినే మూడు రకాలుగా విభజించారు. మృదంగాది ఘన వాద్యాలు (కొట్టి వాయించేవి)

1. రాతి గంటలు, చిడతలు: 2. కంచు తాళాలు; 3 క్సైలోఫోన్ అనే కొయ్య వాద్యము; 4. భూమి దుంధిబి (భూమిలో చిన్న గొయ్యితీసి. ఈ గోతిని చర్మంతో

---

## భారతదేశంలో 370 లక్షల జననాల నిరోధం

గత శతాబ్ది లో (1971-81) ప్రభుత్వం వారి జనాభా నియంత్రణ కార్యక్రమం క్రింద 370 లక్షల జననాలు నిరోధింపబడ్డాయి. 1941-51 దశాబ్దంలో 1000 మందికి 27.4 మరణపురేటు 1981 లో 12.5 కు పడిపోయినా జనాభా పెరుగుదల రేటు నియంత్రించ బడింది.

---

"చిత్రకారుడు రంగులతో, రేఖలతో కల్పించు రూపాన్నే కవి పద సంయోజనంతో కల్పిస్తాడు."



నాగర

కప్పుతారు), సంహితములు మరియు బ్రాహ్మణములలో ఇది పేర్కొనబడింది; 5. డోలు, డప్పు; 6 నాగర; 7. కొయ్య డప్పులు: 8. రెండు ప్రక్కల చర్మంగల డోలు (డోలక్, చెండా వగైరా); 9 తబల; 10. మృదంగము; 11. పంచముఖవాద్యము.

సుషిర వాద్యాలు (గాలితో వాయించబడేవి :

1. రంధ్రాలు లేని కొమ్ములు, గొట్టాలు



పంచముఖ

వెదురు పిల్లనగ్రోవి; 2. తరపా అనే పెద్ద పెద్ద గొట్టాలు; 3. బాకా; 4. రంధ్రాలు గల



హారన్

## మీరైతే....?

(మే 1985)

(బ్రహ్మచారులంతా పేర్లుతీసుకుని ఒక లిమిటెట్ కంపెనీగా ఏర్పడితే...?)

"శాశ్వత సభ్యత్వం తీసుకుంటాను"

D.వి.ఆర్.ఎస్.ఎస్.ఎస్. ప్రసాద్, విశాఖపట్నం.

* * *

"నన్నొక్కణ్ణీ మినహాయించమంటా!"

—'రేమిళ్ళ', హైదరాబాద్.

* * *

"రిబ్బన్ కట్‌చేసి ప్రారంభోత్సవం చేస్తా!"

—వి. చక్రధర్, కవిగిరి, (ప్రకాశం జిల్లా)

"పీటికై జవించిన దప్పి మిక్కుటమగు పాలవలన గానీ, తేనెవలన గానీ ఎన్నడూ తీరదు"

వాద్యగొట్టాలు—మురళి; 5. వేణువు; 6. వాగిన్వరం; 7. హార్మోనియం.

తంత్రీ వాద్యాలు :

1. వారి (బోస్ట్రింగ్, వేదాలలో చెప్పబడ్డ జయ); 2. ల్యూటు (Lute), 3. ఏకతార తుంతిన (ఒక తీగతో); 4. రావణహట్టా




రావణ హట్టా

(ప్రాచీనకాలమునాటిది); 5. స్వరమండల, యాజ్; 6. తంబూరా; 7. కిన్నరి, రుద్ర






స్వరమండల

వీణ; 8. మెట్లు ఏర్పరచిన వీణ, ఏకరాగమేళ వీణ; 9. రఘునాథవీణ; 10. మహానాటక వీణ లేక గోటువాద్యము; 11. వయొలిన్,




యాజ్

సారంగి; 12. హార్ప్సికార్డ్, (Harpischord) పియానో; 13. పశ్చిమ ఆఫ్రికా పీగ్రోలు ఉపయోగించే ఏనుగు దంతపు గొట్టాలు, బాకాలు.

హార్ప్ (Harp) అని చెప్పబడే తంత్రీ వాద్యము అన్ని ప్రాచీన దేశాలలోను ఉపయోగంలో ఉండేది. వేదాలలో చెప్పిన

---

## ప్రపంచంలో బలిష్ఠమైన శాశ్వత అయస్కాంతం

జపానులో ఈ మధ్య ఒక కంపెనీ 'నియోమాక్స్' అనే శాశ్వత అయస్కాంతం (Permanent magnet) కనిపెట్టింది. ఒక ఘన సెంటీమీటరు పరిమాణంగల ఈ క్రొత్త అయస్కాంతం 4.7 కి. గ్రా. భారాన్ని ఎత్తగలదు.

---

"ప్రజానీకంలో విద్యాభివృద్ధి కలిగించడమే ప్రభుత్వపు ముఖ్య కర్తవ్యం."

జయ(Jya), ప్రాచీన తమిళులు ఉపయోగించిన యాజ్ (yazh) పారశీకులు వాడిన చాంగ్ (chang), అరబ్బులు ఉపయోగించిన జంక్ (Junk), బర్మాదేశస్థుల సాన్, (sawn) ఈ జాతివే. కాలక్రమేణ జయ స్వరమండలంగా అభివృద్ధిపొంది ఇది హార్పి స్కార్డ్, స్పైనెట్, పియానోగా అవతరించాయి. ఆధునిక వయొలిన్ ప్రాచీనకాలపు కూర్మవీణ అని అంటారు.




తారపా

సంగీతవాద్యాలు పురాతన కాలంనుంచీ కూడా నాణేలమీద వేశారు లైర్‌వాద్యంతో హిబ్రూ నాణేలు క్రీ. పూ. 2 వ శతాబ్దానికి చెందినవి బ్రిటిష్ మ్యూజియంలో ఉన్నాయి. సముద్ర గుప్తుడు (హార్ప్) ఒక రకం వీణ వాయిస్తున్నట్టు బొమ్మగల నాణేలు ఉన్నాయి. ప్రపంచ సంగీత రంగంలో ఒక దేశానికి సంబంధించిన వాద్యాలు, పారిభాషిక పదాలు ఇతర దేశాలవారు కొంచెం మార్పుతో వాడుకుంటున్నారు.

అరబ్బుల తబలానే తబెల్, తబెర్, తబోర్ అంటారు. భారతదేశపు కిన్నరి, పర్షియాదేశపు శాంతెరిన్(santerin). దీనినే బైబిల్‌లో సాల్టారీ (Psaltari) అని ప్రస్తావించారు. అరబ్బుల డోలు (అతంబర్) వేద కాలంనాటి అదంబర అయివుండవచ్చు. భారతదేశపు తంబూరావంటి వాద్య విశేషం అరబ్బులకు కూడా ఉంది. ఈజిప్టు దేశపు తంబూరాలకు మెట్లుంటాయి. భారతదేశపు భూమి దుంధుబి నేటికీ ఆఫ్రికాలో నీగ్రోలు వాడుతున్నారు. ఆసియాదేశపు క్సైలోఫోన్ ఆఫ్రికాదేశస్థులు కూడా వాడుతున్నారు. ●

# ప్రపంచంలోనే మిక్కిలి ఎత్తైనవి నేపాల్ పర్వతాలు

ప్రపంచంలోనే మిక్కిలి ఎత్తుమీద ఉన్న సరస్సు నేపాల్ ముఖ్యపట్టణమైన ఖాట్మండుకు వాయువ్యంగా మనాంగ్‌లో 4,916 మీటర్ల ఎత్తునఉన్న 'టిలిక్' సరస్సు. ప్రపంచంలోనే మిక్కిలి లోతైన కనుమ నేపాల్‌లో అన్నపూర్ణ మరియు ధవళగిరి పర్వతాల మధ్య 6,967 మీటర్ల లోతునఉన్న 'కాళీఘండర్' కనుమ. ప్రపంచంలోనే మిక్కిలి ఎత్తుమీద ఉన్నరోడ్డు నేపాల్‌లో 6,650 మీటర్ల ఎత్తున్న 'కుటీపాన్'. నేపాల్ డోల్పలోని షెర్పాగ్రామం 4.421 మీటర్ల ఎత్తు మీద ఉంది. ప్రపంచంలో మిక్కిలి ఎత్తైన 12 పర్వతాలలో 11 పర్వతాలు నేపాల్ లోనే ఉన్నాయి.

('నేపాల్ ఫిజికల్ జాగ్రఫీ' సౌజన్యంతో)

"ఒక మంచి పనికి అందరూ వారసులమే అంటారు."

# ద్భుతాలు

ఎస్. వి. మోఘె

“చిన్న చిన్న నీటి బిందువులు చేరి అద్భుతమైన మహాసముద్రం ఏర్పడుతుంది. చిన్న చిన్న మట్టికణాలు చేరి అందమైన భూమి ఏర్పడుతుంది” అన్నాడు జూలియా ఎఫ్. కార్నే.



అల్ప విషయం అంటే ప్రాముఖ్యతలేని సామాన్య సంఘటన. అసలు మానవ జీవితమే అల్పవిషయాలతో కూడి ఉంది. ఇట్టి కొన్ని అల్పవిషయాలను మనం ఖాతరు చేయకపోయినా కొన్నిటివి మాత్రం అతి జాగ్రత్తగా పరిశీలించి తీరాలి. ఒక చిన్న కాల్చి గిరాటేసిన సిగరెట్టు ముక్క పెద్దపెద్ద మంటలతో మహోపద్రవాలను కలిగిస్తుంది. త్రుప్పు పట్టిన చిన్న గుండుసూది శరీరంలో గ్రుచ్చుకుంటే సెప్టిక్ అయి మన జీవితానికే అపాయం కలుగుతుంది. ఒక విస్ఫుకణం ప్రపంచాన్ని మండించగలదనే విషయం జ్ఞాపకం పెట్టుకోవాలి. ఊరికే నోటివెంట జారిన మాటగాని, ఉత్సాహంతో వీపు తట్టినప్పుడు కానీ పూర్తిగా ఒక మానవుని జీవితాన్నే మార్చేస్తాయి.

ఒక్క గోధుమగింజ నాటితే ఒక సంవత్సరంలో అది మొలకెత్తి పెరిగి 50 గింజ

(మిగతా 57 వ పేజీలో)

## బ్రెజిల్ ఆదిమవాసుల రబ్బరు షూలు

పూర్వం బ్రెజిల్ (ద. అమెరికా) లో అమెజాన్ వాలీలో ఇండియనులు రబ్బరు చెట్లకు నాట్లువేసి రబ్బరుపాలను సంగ్రహించి పాదాలకు పట్టించేవారు. పాదాలకు పూర్తిగా అనేకసార్లు ఇలా పట్టించి రబ్బరు పాల పూతతోనే కాళ్ళు ఎండబెట్టుకునేవారు. పూర్తిగా ఎండిన తరువాత అవి మెల్లగా తీసి షూలుగా ఉపయోగించేవారు. ఇటువంటి రబ్బరు షూల 1820 లో ఒక్కొక్క జత 5 డాలర్ల చెప్పున అమెరికాకు ఎగుమతి చేసేవారు.

---

“[illegible] గేసే వారు కషాలో మునుగుతారు.” —విల్ రోజర్స్

# భారతీయ మనీషులు

## మంగళ్ పాండే

ఎన్. కృష్ణమాచార్యులు

మంగళ్ పాండే ధైర్యోత్సాహాలు గల సాహసవీరుడు. మాతృదేశాభిమాని. తన సుఖదుఃఖాలను లెక్కచేయక ప్రాణ



త్యాగానికి తెగించిన ధీరుడు మానసిక శక్తితో ఎన్ని అద్భుతాలనైనా సాధించవచ్చని ప్రపంచానికి చాటి చెప్పిన మహాయోధుడు.

పాండే ఉత్తర ప్రదేశ్‌కు చెందిన చిన్న గ్రామంలో నివసించే సామాన్య కుటుంబంలో జన్మించాడు. విద్యాభ్యాసం పూర్తికాకుండానే ఆంగ్లేయుల పరిపాలనా కాలంలో ప్లాటూన్ నెం. 35 లో సిపాయిగా చేరాడు. బ్రిటిష సామ్రాజ్యం మిక్కిలి ఉచ్ఛస్థితిలో ఉన్న రోజులవి. తమ కీర్తి ప్రతిష్ఠలకు అంతమయే మన్నదే లేదని ఆంగ్లేయులు విర్రవీగుచున్న కాలం.

భారతదేశపు స్వాతంత్ర్య చరిత్ర పుటలలో 1857 వ సంవత్సరం మిక్కిలి ప్రాముఖ్యమైనది. ఆ సంవత్సరంలో ఒకనాడు భారత సైన్యం ఉండేబారక్కులలో గొప్ప సంచలనం

## గృహ వైద్యం

'లంఖణం పరమౌషధం'. దీనివల్ల ఎన్నో రోగాలు నయమవుతాయి. వెచ్చని పాలతోనో, నీళ్ళతోనో త్రిఫలాది చూర్ణం సేవిస్తే మలబద్ధకం పోతుంది అజీర్ణంగా ఉంటే పొద్దున్నే పరగడుపున అల్లంముక్కలు పంచదారతో నమిలి తినండి. చెవులలోనుంచి చీము కారుతూ ఉంటే వెల్లుల్లినూనెగానీ. వేప నూనెగానీ నాలుగు చుక్కలు వేయండి నోటి చిగుళ్ళవాపుకి కొంచెం ఆవనూనె. ఉప్పుకలిపి చిగుళ్ళకు పట్టించండి. కీళ్ళ నొప్పులకు ఆవనూనె మర్దన చేయండి. పుప్పి పంటికి కొంచెం కర్పూరం పెట్టండి

"అతి సరళమైన దానిని అతి జటిలం చేయడం ప్రగతి చమత్కారం" —డోర హాయిర్ ఛాహా

చెలరేగింది. భారతీయ సిపాయిలు ఉపయోగించుకోడానికి ఆవు కొవ్వు పూసిన తూటాలను ఆంగ్లేయులు ఇంగ్లండునుండి తెప్పించారు. ఈ తూటాల నిర్మాణ నైపుణ్యానికీ, శక్తి సామర్థ్యాలకు గానీ వారు ఉపయోగించే ఆవు కొవ్వుకు ఎంత మాత్రం సంబంధం లేదు ప్రత్యేక దురభిప్రాయంతో హిందూ సైనికులను అవమానించాలని ఆంగ్లేయులు ఆ తూటాలకు ఆవుక్రొవ్వును పట్టించారు.

హిందువులకు గోమాత మిక్కిలి పవిత్రమైన జంతువు. అట్టి పవిత్రమైన ఆవును చంపి ఆ కొవ్వును పూసిన తూటాలు ఉపయోగించడం తనకు సంభవించిన మహాపాతకమనుకున్నాడు పాండే.

మా ప్రాణాలనైనా త్యాగం చేస్తాం కాని ఆ తూటాలను మాత్రం మేము ఉపయోగించమని హిందూ సైనికులు పట్టుపట్టారు. వెంటనే ఆ తూటాలను ఆంగ్లేయులు ప్లాటూన్ నెం. 19కి తరలించారు. అక్కడి హిందూ సిపాయిలు కూడా వీటిని ఉపయోగించడానికి నిరాకరించారు. ఆంగ్లేయ సైన్యాధికారి నిర్బంధంచేసి భయపెట్టడానికి ప్రారంభించాడు. హిందూ సైనికులు ధైర్యంతో నిరాకరించి తమ ఖడ్గాలతో ఆంగ్లేయ అధికారులను ఎదిరించి, తమ గౌరవ మర్యాదలను సంరక్షించుకోడానికి ప్రారంభించారు ఆంగ్లేయులు దీనిని శ్వేతజాతులపై 'నల్లసిపాయిల తిరుగుబాటు'గా భావించారు హిందూ సైనిక దళాలను నిరాయుధులుగా చేసి వారిని ఉద్యోగం నుండి తొలగించారు.

ఈ సంగతి విన్న పాండేకి పట్టరాని కోపంతో కన్నులు ఎర్రబడ్డాయి. శరీరంలో రక్తం ఉడికి పోయింది. ఆవేశపూరితంగా, ఉద్రేకంతో తన తుపాకిని తూటాలతో నింపి, "చంపండి, ఆంగ్లేయులను కాల్చి చంపండి" అంటూ కవాతు మైదానంలోకి పరుగెత్త సాగాడు.

## 1983 వరదలవల్ల నష్టం అత్యధికం



భారతీయ ప్రభుత్వపు ఇరిగేషన్ మినిస్ట్రీ అంచనా ప్రకారం 1983 సం.లో సంభవించిన వరదలవల్ల రూ. 2,292 కోట్లు నష్టం సంభవించింది. 1983 సం. రం వరదలవల్ల మొత్తం 358.1 లక్ష హెక్టేరుల భూమి దెబ్బతింది రూ 1,158 కోట్ల విలువ గల పంటలు నశించాయి. తంతి, తపాలా రాకపోకలకు రూ. 784 కోట్లు నష్టం ఏర్పడింది. మొత్తం 487 లక్షలమంది నష్టపడగా 2,166 మంది ప్రాణాలు కోల్పోయారు.

'విభేదంలో క్రమాన్ని. క్రమంలో విభేదాన్ని
సంరక్షించడం ప్రగతి నైపుణ్యం." —ఆల్‌ఫ్రెడ్ నార్త్ వైట్ హెడ్

'ఈ కుక్క మొరుగుతూంది. బంధించండి' అని సార్జెంటు సిపాయిలకు ఆదేశమిచ్చారు. సైన్యంలో ఒక్క సిపాయికూడా కదలలేదు, మెదలలేదు. సార్జెంటు పట్టరాని కోపంతో 'విశ్వాసంలేని కుక్కలు. నీచులు. మీరు మానవులా?' అని నిందించడం ప్రారంభించాడు. వెంటనే పాండే తుపాకీ పేల్చి సార్జెంటునూ, అతడితో పాటు మరి ఇద్దరు ఆంగ్లేయ సైనికాధికారులను హతమార్చాడు. పాండేని లొంగిపొమ్మని చెప్పుటకు ఆంగ్లేయులు హిందూ సైనికులను ప్రోత్సహించారు. ఎంతమాత్రం లాభం లేకపోయింది. పాండే మీద చేయివేసిన వారిని చంపివేస్తామని సిపాయిలు హెచ్చరించారు.

చివరకు కల్నల్ వీలర్ అనే ఆంగ్లేయ సైన్యాధికారి కొంత సైన్యంతో వచ్చి పాండే ప్లాటూన్‌ను ముట్టడించాడు. ఇక తప్పించుకోడానికి సాధ్యం కాదని గ్రహించి పాండే తుపాకీ గురి వేసుకుని ఆత్మహత్య చేసుకోడానికి ప్రయత్నించాడు. విధి వక్రించింది. పాండే తీవ్రంగా గాయపడ్డాడు. గాయపడిన పాండేని ఆంగ్లేయులు బంధించారు.

మిలటరీ కోర్టు విచారణచేసి పాండేని ఉరితీయమని తీర్పు చెప్పింది. ఏప్రిల్ 8, 1857 సం. లో బారక్‌పూర్‌లో ఒక చెట్టుకు వ్రేలాడదీసి పాండేని ఉరితీశారు.

మహాయోధుడైన పాండేకి ఇంతకంటే కావలసినది మరొకటిలేదు. ఒక్క దేశాభిమానం తప్ప ఇతర కోరికలు, వాంఛలు లేని పాండే వంటి యోధులను ప్రపంచం మెచ్చి గౌరవిస్తుంది.

## ఒక్క సెకనుకి 50 లక్షల ఆదేశాల నిచ్చే క్రొత్తరకం కంప్యూటరు



ఇరవై సంవత్సరాలకు పూర్వం ప్రపంచంలో మిక్కిలి శక్తివంతమైన కంప్యూటరుకు ఒక గదినిండా సరంజామా ఉండేది. ఈనాడు అదే శక్తితో ఇంకా ఎక్కువ సందేశాలను పసిబిడ్డల బొటనవ్రేలి గోరుకంటే చిన్నదైన సిలికాన్ 'చిప్' మీద సర్క్యూట్లతో ఏర్పాటు చేయవచ్చు. క్రొత్త 32—బిట్ మైక్రో ప్రోసెసర్లలో అమెరికా జిలాంగ్ ఇన్‌కార్పొరేటెడ్ వారు Z 80,000 కంప్యూటర్ ప్రొసెసింగ్ యూనిట్ (CPU) మిక్కిలి శక్తివంతమైనదని ప్రకటించారు. ప్రతి Z 80,000 చిప్‌కి 1,20,000 ట్రాన్సిస్టర్లు ఉంటాయి. వాటి సహాయంతో కంప్యూటర్లు లెక్కలు కడతాయి Z 80,000 (CPU) సెకండుకు 50 లక్షల ఆదేశాలను ఇవ్వగలదు. బాగా అభివృద్ధిపొందిన అధిక వేగపు మిలటరీ అంతరిక్ష కంప్యూటర్లు మొదలు రోబోట్ నిర్మాణాలవరకు దీనికి అనేక ఉపయోగాలున్నాయి.

"జగత్తున పరువుప్రతిష్ఠలు నిలుపుకొనుటయే మనుష్యుని జీవితాదర్శము."

# పులు-బడ్జెరిగారులు

ఆర్. ఎల్. ఖన్నా

ఆస్ట్రేలియాలో నివసించే బడ్జెరిగారులు (Budgerigars) చిలుకల వంటి చిన్న చిన్న పక్షులు. ఇవి ఈనాడు ప్రపంచమంతటా పెంపుడు పక్షులుగా ప్రసిద్ధిపొందాయి. ప్రేమతో



వీటిని పెంచుకునే ఒక ఆమె బడ్డీ 'నా గురువు, హాస్యగాడు. నా ప్రాణమిత్రుడు' అని చెప్పుకుంది ప్రపంచమంతటా లక్షలాది జనులు అనేక విధాలుగా సహకరించే ఈ వింత పిట్టలను ఇళ్ళలో ఆనందంగా పెంచుకుంటున్నారు.

ఎంతో చురుకుగా, చలాకీగా, వినయంగా, సరసంగా. వినోదంగా, అమరాగంతి ప్రవర్తిస్తూ ముద్దుగా ఉంటాయి ఈ చిన్న పక్షులు. అందుకే వీటిని పెంచుకోడానికి అందరూ ఉబలాటపడతారు. రంగు రంగులతో ప్రకాశిస్తూ, అతి నాజూకుగా, అందంగా ఉంటాయి. ఒక్కసారి చూస్తే వీటిని వదల బుద్ధికాదు.

తియ్యతియ్యగా ముచ్చటగా మాట్లాడతాయి ఎలా నేర్పితే అలాగే నేర్చుకుంటాయి. ఏం చెబితే అవి అలా చేస్తాయి. అనుకరిస్తాయి. మిక్కిలి విశ్వాసంగా ఉంటాయి.

ఇవి చెట్లమీద సహజంగా. సహజీవనాన్ని ఆశించే పక్షులు. గుంపులు, గుంపులుగా ఉంటాయి. పరస్పర సహకారంతో అన్యోన్యంగా జీవించే పక్షులు. వీటి జీవితం 14 సంవత్సరాలు.

సాధారణంగా అక్టోబరు నెల నుండి డిసెంబరు నెల వరకు గ్రుడ్లు పెట్టినా సంవత్సరం పొడుగునా గ్రుడ్లను పెట్టి పొదుగుతూనే ఉంటాయి. 18 రోజులపాటు గ్రుడ్లను పొదుగుతూ ఉంటాయి. మామూలుగా చెట్ల

## 86 సంవత్సరాల దాంపత్య జీవితం!

సర్ తెముల్‌జీ బికాజీ నారిమన్, ఆతని సతీమణి 1853 సం రం నుండి 1940 వరకు భార్యాభర్తలుగా జీవించారు ఇతడు 1940 లో మరణించాడు. 86 సం. ల దాంపత్య జీవితం తరువాత ఆమెకు వైధవ్యం సంభవించింది.

"వర్తమానమే సతత సవస్య భోగ్యమనుకునేవారు అదృష్టాన్ని ఆరాధించరు." —జార్జి లూయి బార్జన్

తొర్రలలో నివసిస్తూ ఉన్నప్పటికీ యూకలిప్టస్ చెట్లమీద గూళ్ళను నిర్మించుకుంటాయి. ఇవి ఒక్కొక్క పర్యాయం 4 మొదలు 8 దాకా గ్రుడ్లను పెడతాయి. తమ పిల్లలు కాకపోయినా ఇతరవాటిని కూడా ఎంతో ఆదరంగా ప్రేమతో, అభిమానంతో పెంచుతాయి.

బడ్జీ కూతలు వినడానికి ఎంతో ఇంపుగా ఉంటాయి. వాటి జీవితం సరసమయమైన ఒక ఆనందమయ జీవితం. కిచుకిచు మని అరుస్తూ మిక్కిలి వేగంగా సూటిగా ఎగురుతూ ఉంటాయి. ఈ పక్షులు ఒక చోటునుంచి మరోచోటికి వలసలు పోయేటప్పటి దృశ్యం చూచి ఆనందించవలసిందే. పెద్ద గుంపుగా చేరి ఆకాశంలో ఎగిరిపోతూ ఉంటే ఆకాశంలో సూర్యుణ్ణి కూడా కప్పే నల్లటి మేఘంలా ఉంటుంది. హరివిల్లు రంగులతో ఎగిరిపోతూ ఉన్న పువ్వులలాగ కనుపిస్తాయి.

బడ్జెరిగారులు ఎప్పుడూ జంటలుగానే ఉంటాయి ఇవి పరస్పర ప్రేమతో జీవించే ప్రేమైక జీవులు. ఒంటరిగా వీటిని పెంచడం మిక్కిలి కష్టం. ఎంతో తెలివైన ఈ పిట్టలకు అమితమైన కాలజ్ఞానం ఉంది. క్రమబద్ధమైన జీవితానికీ, సాంఘిక జీవనానికీ అలవాటుపడ్డవి కాబట్టి పిల్లులు, కుందేళ్ళు వంటి చిన్న చిన్న పెంపుడు జంతువులతో ఎంతో కలిసి కట్టుగా ఉంటాయి. ఈ చిన్న పక్షులు తిండికోసం చేసే ఆర్భాటం ఇంతా అంతా కాదు. బచ్చలి, క్యాబేజి, మెత్తటి గడ్డి మొదలైన రకరకాల ఆకులను బుజ్జగించి తినిపించాలి.

అనేక దేశాలలో బడ్జీ ప్రదర్శనలు ఏర్పాటు చేస్తూ ఉంటారు. ఈ ప్రదర్శనలను సందర్శించడానికి ఎంతోమంది జనం వెళుతూ ఉంటారు. పక్షులకై ఏర్పడ్డ సంస్థలు,సంఘాలు ప్రత్యేకంగా ఈ పక్షులకు సంబంధించిన ఎక్సికర్షనులు, ఉపన్యాసాలు ఏర్పాటుచేస్తారు. బ్రిటన్‌లో బడ్జీల పెంపకం ఒక నేషనల్ హాబీగా పరిణమించింది. ప్రదర్శనలలో పాల్గొనడానికి వీటికి ప్రత్యేకమైన శిక్షణను ఇస్తారు ఇంగ్లండు, అమెరికా, ఫ్రాన్స్ దేశాలలో వీటికి సర్కస్‌ల ప్రదర్శనలకు ప్రత్యేకంగా తర్ఫీదు ఇచ్చి తయారు చేస్తారు. నిచ్చెనలు ఎక్కడం, స్థంభాలు ఎక్కడం, చిన్న చిన్న కార్లు, సైకిళ్ళు నడిపించడం, ఉయ్యాలలు ఊగటం మొదలైన చమత్కారాలు నేర్పిస్తారు.

ఈ ప్రేమైక జీవులు ముద్దుముద్దుగా పలుకుతాయి. అనుకరిస్తాయి. మాటలు అనుకరించడానికి మగపక్షులే మిక్కిలి అనుకూలం. బడ్జీలకు తెల్లవారుజామున పాఠాలు నేర్పిస్తారు. చిన్న చిన్న వాక్యాలు, నర్సరీ రైములు తప్పులేకుండా వప్పచెబుతాయి. కొన్ని బడ్జీలకు సాధారణంగా మనకే నోరు తిరగని 'పీటర్ పైపర్ పిక్డ్ ఎ పెక్ ఆఫ్ పికిల్డ్ పెప్పర్' అనే రైములను కూడా చెప్పే నేర్పు ఉంది. ●

## తల టోపిలో గ్రుడ్డు పెట్టిన పావురం

అమెరికా న్యూయార్కు నగర వీధిలో నడిచిపోతున్న విటోడిలూకా తలమీద టోపిలో పావురం ఒక గ్రుడ్డు పెట్టింది.

"ఓం తత్ సత్ అనే వాక్యంలో బ్రహ్మ త్రివిధనామములు ఏర్పడ్డాయి."

# భిన్నత్వంలో ఏకత్వం

భారతదేశంలో విభిన్న ప్రాంతాలలో నివసించే మానవుల అన్యోన్యత, ఐక్యత నిన్న మొన్నటిది కాదు. ఏనాటిదో! వేలాది సంవత్సరాల నాటిది. శతాబ్దాల తరబడి దేశంలో మూల మూలలనుండి సాంస్కృతిక నైతిక ప్రవాహాలు వెల్లువలై ప్రవహించి యావద్భార



డా. రాజేంద్రప్రసాద్

తావనిని పునీతం చేశాయి. రకరకాల పంటలు, మొక్కలు, చెట్లు ఒకే జీవన స్రవంతి ఆకళించుకుని సుభిక్షమైన ఫలసాయాన్ని, ఫలపుష్పాదులను ప్రసాదిస్తున్నట్లే దేశంలో అనేక ఆచార వ్యవహారాలు, వేష భాషలు, సంస్కృతులు ఏకప్రవాహంగా వివిధ ప్రదేశాలలో ప్రవహించి ఏకత్వాన్ని ఆపాదించాయి. భిన్నత్వంలో ఏర్పడిన ఏకత్వం గాలి కంటె సున్నితం. ఉక్కుకంటే బలిష్ఠం. వివిధ కళా విన్యాసాలలో, వాస్తువైవిధ్యంలో, విభిన్న వాఙ్మయంలో, తాత్త్విక వైవిధ్యంలో ఏకత్వం దివ్యజ్యోతిగా ప్రకాశిస్తుంది. ●

## పాఠకుల అభిప్రాయాలు

(మే 1985)

"వంగే మొక్కలు మాత్రమే తుఫాను
తాకిడులనుంచి అజేయంగా నిలుస్తాయి.
వినయసంపత్తులు కలిగినవారే
విజేతలు కాగలుగుతారు"

—ఎల్. సత్యనారాయణ, వెంకంపేట,
(విజయనగరం జిల్లా)

* * *

"మంచి చెప్పే కవి
సమాజానికే రవి."

—ఎమ్. పంకజాక్షి, ఖరగ్‌పూర్.
(ప. బెంగాల్)

* * *

"అవివేకితో స్నేహం కంటే
వివేకితో విరోధం మేలు."

—సురేంద్రరావు కులకర్ణి, బీర్కూరు
(నిజామాబాద్ జిల్లా)

"సత్పురుషులు నరికిన గొడ్డలికి
సువాసనలిచ్చే చందన తరువులు." —రామచరిత మానస

# సుప్రసిద్ధ సేనానులు

## హెరాల్డ్ ఆర్. అలెగ్జాండర్

బ్రిటన్ ప్రధానమంత్రి విన్‌స్టన్ చర్చిల్ ఆగస్టు 10, 1942 న జనరల్ సర్ క్లాడ్ అచిన్‌లెక్‌ను తొలగించి మిడిల్ ఈస్ట్ (మధ్య ఆసియా) లో జనరల్ హెరాల్డ్ ఆర్.



అలెగ్జాండర్‌ను కమాండర్ ఇన్ చీఫ్‌గా నియమించారు. ఈజిప్టు-లిబియాలలో గల స్థావరాలు, సరఫరాలుతో పాటు ఫీల్డ్ మార్షల్ ఎర్విన్ రోమెల్ ఆధీనంలో ఉన్న జర్మన్ ఇటాలియన్ సైన్యాన్ని స్వాధీనం చేసుకోడంగాని, హతమొందించడంగాని ముఖ్య కర్తవ్యం అని ఆదేశించారు ఇంతకుముందే లిబియా ఓడిపోయింది. ఈజిప్టు చాలామటుకు రోమెల్ ఆధిపత్యంలో జర్మన్ ఇటాలియన్ సైన్యం చేత ఆక్రమింపబడింది. మెడిటరేనియన్ తీరంలో ఈజిప్టులో ఉన్న అలెగ్జాండ్రియా బ్రిటిష్ నౌకా స్థావరాలకు 70 మైళ్ళ దూరంలో ఉంది. సూయజ్ కాలువ, అరేబియా నూనె క్షేత్రాలు, దక్షిణ ఆసియాలో ఇండియా పరిస్థితి ఆందోళనకరంగా ఉన్నాయి. గ్రేట్ బ్రిటన్‌కు భవిష్యత్తులో ఆపద సంభవించక మానదని భయం ఏర్పడింది. ఇట్టి సమయంలో బ్రిటన్ సైన్యంలో చెప్పతగ్గ వ్యవస్థితమైన మార్పు అత్యావశ్యకమని చర్చిల్ నిర్ణయించాడు.

మరి ఆరునెలలకు బ్రిటిష్ ప్రధానమంత్రి

---

### ఆదాయపు పన్ను బకాయి

భారతదేశంలో 20 పెద్ద పెద్ద పెట్టుబడిదారుల ఆదాయపు పన్ను బకాయి మొత్తం రూ. 5,429.57 లక్షలు. ఈ జాబితాలో ప్రథమస్థానానికి చెందే బిర్లాకు రూ. 1,350.13 లక్షల బకాయి ఉంది.

"గతం కనిపించని గతం
రామన్నది కనిపించని భవిష్యత్ భావగర్భితం."

-సామర్ సెట్ మామ్

విన్స్టన్ చర్చిల్ ఆదేశాన్ని అలెగ్జాండర్ నెరవేర్చాడు. ఈజిప్టు, సైరినైకా, లిబియా, ట్రిపోలీటానియాలలో జర్మన్ ఇటలీ దళాలు పూర్తిగా నశింప బడ్డాయి. అలెగ్జాండర్



జనరల్ బెర్నార్డ్ ఆధిపత్యంతో బ్రిటిష్ సైన్యాన్ని ప్రసిద్ధిపొందిన రోమెల్ అధికారంలో ఉన్న ఆఫ్రికా కోర్ మీదికి పంపి ఓడింపచేసారు. ఎడారులగుండా వెళ్ళి జర్మన్ సైన్యం మీదికి దాడిచేసి ట్యునీషియా వరకు వారిని తరిమి తరిమి కొట్టారు.

రెండవ ప్రపంచయుద్ధంలో బ్రిటిషు వారికి ఇదే మొదటి ఘన విజయం రెండవ ప్రపంచ యుద్ధపు సేనాధిపతులలో ప్రసిద్ధి పొందిన అలెగ్జాండరు ఆజానుబాహుడు. నీలపుకళ్ళతో పెద్ద పెద్ద మీసాలతో మంచి స్ఫురద్రూపి.

ఇతడు కాలెడాన్ 4 వ ఎర్ల్ అయిన హెరాల్డ్ రూపర్ట్ లియోఫ్రిక్ జార్జి అలెగ్జాండర్ మూడవ కుమారుడు. పశ్చిమ ఐర్లండ్ టైరోన్ లో డిసెంబరు 10, 1891 వ జన్మించాడు. హారోలో పట్టభద్రుడై సాన్డ్ హర్స్ట్ మిలటరీ కాలేజీలో చేరాడు. 1911 వ సం.లో ఐరిష్ గార్డ్సులో రెండవ లెఫ్టినెంట్ గా నియమింపబడ్డాడు.

మొదటి ప్రపంచయుద్ధంలో ఇతడు ప్రదర్శించిన అసమాన శౌర్య పరాక్రమాలకు లీజియన్ ఆఫ్ ఆనర్, మిలటరీ క్రాస్, డిస్టిన్ గ్విష్డ్ సర్వీసు ఆర్డరు బిరుదులను పొందాడు. 25 వ సంవత్సరం వయస్సులోనే లెఫ్టినెంట్ కల్నల్ గా నియమింప బడ్డాడు. 47 ఏళ్ళ వయస్సులోనే బ్రిటిష్ సైన్యంలో మేజర్ జనరల్ గా నియమింపబడ్డాడు.

రెండవ ప్రపంచ మహాయుద్ధం ప్రారంభం నుంచీ ఇతడు అనేక కష్టసాధ్యమైన ఉద్యోగాలను స్వీకరించవలసి వచ్చింది. కమాండర్ గా ఉంటూ ఇతడు డన్ కిర్క్ నుండి బ్రిటిషుదళాలను జూన్ 1940 లో తరలించవలసి వచ్చింది. జర్మను సైన్యానికి లొంగిపోతాడేమో అనుకుంటున్న తరుణంలో ఇతడు 3,37, 131 మంది సైనికు

(మిగతా 49 వ పేజీలో)

## ప్రాతిపదిక విద్యకు ప్రాతి నిధ్యం

పిల్లలు తమ తమ జీవితాలను నియంత్రించుకుని అభివృద్ధి చేసుకోడానికి అక్షరాస్యత, పౌష్టికాహారం, ఆరోగ్యం, ఆరోగ్య శాస్త్ర శిక్షణ, గృహాభివృద్ధి, నిర్మాణ నైపుణ్యాలు, ఉద్యోగ నైపుణ్యాలు, పరిసర విజ్ఞానం మొదలైన విషయాలను తెలియజేసే విద్యా సౌకర్యాలు కలిగించడానికి ప్రాధాన్యత ఇవ్వాలని యునిసెఫ్ (Unicef ) అంటూంది.

"సందేహరహితత్వం. భయరహితత్వం
ముక్తికి ముఖ్య లక్షణాలు." —గీత

# యాత్రాస్థలాలు

## తిరుపతి

భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత ప్రతిదినం భక్తులు వేంకటాచల



శ్రీ వేంకటేశ్వర స్వామి

పతి అయిన శ్రీ వేంకటేశ్వర స్వామి దివ్య దర్శనం చేసుకోడం విపరీతంగా పెరిగిపోయింది. ఒక్క ఆంధ్రులకే గాక భారతీయులందరికీ శ్రీ వేంకటేశ్వర స్వామి పరమ దైవం. నానాటికీ పెరిగిపోతూన్న దేవాలయ ఆదాయం వల్లే దీన్ని మనం గ్రహించుకోవచ్చు. తిరుపతి అంటే శ్రీ వేంకటేశ్వర స్వామి—కలియుగ ప్రత్యక్ష దైవం—ఏడు కొండల స్వామి.

ఆంధ్రప్రదేశ్‌లో చిత్తూరు జిల్లాలో చంద్రగిరి తాలూకాలో తిరుపతి సరిహద్దులలో తూర్పు కనుమల కొండలు ఆకాశాన్ని అంటుతూ ఉంటాయి. సాధారణంగా తిరుపతి అంటే ఏడుకొండల క్రింద ఉన్న తిరపతి పట్టణం, దిగువ తిరుపతి. కొండలపైన 14 మైళ్ళ దూరంలో తిరుమల, ఎగువ తిరుపతి

### న్యాయంగా ఇచ్చిన భాగ్యం నశించదు

ఒక బండిమీద నెమలి ఈకలే తీసుకుపోవచ్చు కాని అది మోయగల భారాన్ని మించిపోతే బండి ఇరుసు విరిగిపోతుంది. చెట్టు ఎక్కిన మనిషి కొమ్మ చిట్ట చివరికి ఎక్కడానికి ప్రయత్నిస్తే కొమ్మవిరిగి కొమ్మతోపాటు క్రిందపడి మరణిస్తాడు.

శక్తికి తగినట్టుగా న్యాయంగా ధర్మం చేసిన ధనం ఎన్నటికీ నశించదు.

—తిరుక్కురళ్

"మంచిచెడ్డలు ఆలోచించని మనిషి నోటికి పగ్గాలు లేవు,
ఇష్టమొచ్చినట్టు మాట్లాడి కష్టాల్లో చిక్కుకుంటాడు."

శ్రీశైలందాకా ఈ కొండలు ఆదిశేషుని రూపంలో ఉన్నాయని, ఆ ఆదిశేషుని పడగ పైన, పర్వతం మీద శ్రీ వేంకటేశ్వర స్వామి ఆవిర్భవించాడని పురాణ ప్రసిద్ధి. శ్రీ వేంకటేశ్వరస్వామి దర్శనం చేసుకుంటే తమ జన్మ ధన్యమయిందని భావించని భక్తులుండరు.

తమిళ గ్రంథాలలో కూడా వేంకటనాథుని గురించిన వర్ణనలు ఉన్నాయి.

తిరుపతికి మద్రాసు నుండి గానీ, ఇతర ప్రాంతాల నుండి గానీ అతి సులభంగా చేర వచ్చు. అన్ని ప్రదేశాలకు రేణిగుంట ముఖ్యమైన జంక్షను. దిగువ తిరుపతి రేణిగుంటకు 10 మైళ్ళ దూరంలో ఉంది. తిరుపతి నుండి



కిరీటము

వైష్ణవమత స్థాపకులైన శ్రీ రామానుజులు ఈ దివ్యక్షేత్రాన్ని సందర్శించి అచ్చట నిత్య పూజా కార్యక్రమాలు, ఉత్సవాలు సంస్కరించి ఏర్పాటు చేసారని ప్రతీతి. శ్రీ రామానుజులు నిర్ణయించిన పూజా కార్యక్రమాలు, ఉత్సవాలు నేటికీ జరుగుతున్నాయి. తమిళ ప్రబంధం ఇక్కడ చదువుతారు. ఇది శ్రీరామానుజుల ఆదేశానుసారం జరుగుతుంది. ఈ దేవాలయం అతి ప్రాచీనమైనది. శ్రీ వేంకటేశ్వర స్వామిని గురించిన ప్రసక్తి ఋగ్వేదంలో ఉంది. సంగమ కాలానికి చెందిన

## మనస్సు పాలవంటిది

మనస్సు పాలవంటిది. పాలు నీళ్ళు కలిసిపోయినట్లు మనస్సు ప్రపంచంలో విలీనం అయిపోతుంది. అందుకే పాలు జాగ్రత్తగా తోడుపెట్టి పెరుగుచేసి తరువాత చిలికి వెన్న తీస్తారు. అలాగే ఏకాంతంగా, ఆధ్యాత్మిక చింతనతో మనస్సును మధించి భక్తి వైరాగ్యాలను సిద్ధించుకొంటే వెన్న నీటిలో తేలినట్టుగా భక్తి వైరాగ్యాలు ప్రపంచంలో తేలతాయి.

—శ్రీ రామకృష్ణ పరమహంస

"సృష్టికర్తను ప్రేమించే ముందు నీ సహచరుని ప్రేమించు."

—మహమ్మదు

ఎగువ తిరుపతికి తెల్లవారుఝామునుండి చీకటి పడేదాకా బస్సు సౌకర్యం ఉంది. ఘాట్ రోడ్డు మీదుగా తిరుపతినుండి తిరుమలకు ఒక గంట ప్రయాణం. చాలామంది భక్తులు పాత నడక దారి మీదుగా కొండ ఎక్కి స్వామిదర్శనం



గుడిగోపురం

చేసుకుంటారు. నడకదారి సుమారు 11 కి.మీ. ఉంటుంది. కొండ ఎక్కడానికి 3 గంటలు పడుతుంది. మొదటి మోకాళ్ళ పర్వతం మెట్లు తప్ప తక్కిన మెట్లు ఎక్కడం అంత కష్టం అనిపించదు.

ప్రతిరోజూ శ్రీ స్వామివారికి ఉదయం నాలుగు గంటలకు సుప్రభాతం — 'మేలు కొలుపు' ప్రారంభ మవుతుంది. ప్రాతః కాలంలో జరిగే మేలుకొలుపుసేవ మొదలు రాత్రి ఏకాంతసేవ వరకు—తోమాలసేవ, కొలువు, సహస్రనామ అర్చన, నైవేద్యం, సర్వదర్శనం, మధ్యాహ్నపు పూజ, రాత్రి పూజ, పవళింపు సేవ జరుగుతాయి.

శ్రీవారి దేవాలయం పూర్తిగా ద్రావిడ శిల్పకళా వైభవాన్ని చాటుతుంది. దేవాలయ ముఖద్వారం తూర్పుముఖంగా ఉంటుంది. కొద్దిరోజులలోనే తిరుమల దేవాలయం గోపురం భారతదేశంలోనే అత్యున్నతమైన గోపురంగా నిర్మించబడుతుంది దీనిఎత్తు 247 అడుగుల, 6 అంగుళాలు ఉంటుంది.



ఆనంద నిలయం

దీని నిర్మాణానికి సుమారు రూ. 3 కోట్లు ఖర్చు కాగలదని అంచనా వేశారు.

## 1990 నాటికి కృత్రిమ హృదయం

సం. నాటికి పూర్తిగా యాంత్రికంగా పనిచేసే కృత్రిమ హృదయం రోగులకు సిద్ధిస్తుంది అమెరికా క్లీవ్‌లాండ్ క్లినిక్ వైద్యుడు డా. యుకీహైక్‌నోస్ దీనికి కావలసిన విడిభాగాలు లభిస్తాయి అని అంటున్నారు.

"నేటి సంశయాలే రేపటి అనుభవాలకు అవధులు." — ఫ్రాంక్‌లిన్ డి. రూజ్‌వెల్ట్

దేవాలయ గర్భగృహం మీది గోపురాన్ని 'విమానం' అంటారు. ఈ విమానమే ఆనంద నిలయం. ఇది పూర్తిగా బంగారు రేకులతో కప్పబడింది. ఆలయంలో ముఖ్యంగా మూడు ప్రాకారాలు ఉన్నాయి. గర్భగుడి తలుపులకు



తిరుమలలో భక్తులు

బంగారు రేకులు తాపడం చేశారు. అందుచేత దీన్ని 'బంగారు వాకిలి' అంటారు. గర్భగృహంలోకి ప్రవేశించిన వెంటనే శ్రీ వేంకటేశ్వర స్వామివారి దివ్యదర్శనం లభిస్తుంది. దీన్ని 'మూలవర్లు' అంటారు. ఉత్సవ సమయంలో ఊరేగింపుగా తీసుకువెళ్ళే ఉత్సవ మూర్తి 'ఉత్సవర్లు'. మలయప్పస్వామి. భోగ శ్రీనివాసమూర్తి, కొలువు శ్రీనివాసమూర్తి, ఉగ్ర శ్రీనివాసమూర్తి ఇక్కడి ఇతర విగ్రహాలు అన్నీ శ్రీ వేంకటేశ్వరస్వామి వివిధ రూపాలే

భక్తులు శ్రీవారికి చెల్లించే తమ ముడుపులు—ఆభరణాలు, నాణేలు, కరెన్సీ నోట్లు వగైరా—ప్రత్యేకంగా బంగారు వాకిలి దగ్గర ఏర్పాటు చేసిన హుండీలో వేస్తారు. ప్రతి దినము 'శ్రీవారి' నైవేద్యం భక్తులకు సర్వ దర్శనం (ధర్మదర్శనం) సమయంలో పంచి పెడతారు. ఇక్కడి భక్తులందరూ అభిలషించే ముఖ్య ప్రసాదం శ్రీవారి గంధం, శ్రీపాద రేణువు. తిరుమల కొండల చుట్టుపట్ల ఎన్నో పుణ్యతీర్థాలు ఉన్నాయి. భక్తులు వీటిలో స్నానాలుచేసి పునీతులు అవుతున్నారు స్వామి పుష్కరిణి తీర్థం దేవాలయానికి దగ్గరగా ఉంది. శ్రీవారి దర్శనం చేసుకునే ముందు భక్తులు ఇందులో స్నానం చేస్తారు పుష్కరిణిలో స్నానంచేస్తే సర్వపాపాలు హరిస్తాయి. కొండ ఎక్కుతూ దేవాలయానికి 3 కి మీ. దూరంలో ఉన్న ఆకాశగంగలో స్నానంచేస్తే శ్రమ తీరి ఎంతో హాయిగా ఉంటుంది.



శ్రీ పద్మావతి దేవి

శ్రీవారి పూజకి ఈ ఆకాశగంగ నీళ్ళే అభిషేకం చేస్తారు. 5 కి.మీ. దూరంలో 'పాపనాశనం' జలపాతం ఉంది. ఇలాగే చుట్టు

"తమ దోషాలను తెలుసుకొని వివేకవంతుడు
వినయం పొందుతాడు, మూర్ఖుడు సంతపిస్తాడు."

పట్ల అతి సుందరమైన 11 జలపాతాలు ఉన్నాయి. ఇవి ఎంతో పవిత్రమైనవి.

దిగువ తిరుపతిలో అనేక ప్రాచీన దేవాలయాలు నిర్మింపబడ్డాయి. వీటిలో ముఖ్యమైనది గోవిందరాజస్వామి దేవాలయం. ఇది శ్రీ రామానుజుల వారిచే ప్రతిష్ఠాపన చేయబడింది. ఈ ఆలయం చుట్టూ నగర నిర్మాణం కూడా వీరు నిర్ణయించినదే నట. వైభవోపేతమైన ఈ వైష్ణవ పుణ్యక్షేత్రంలో కొండ దిగువ కపిల తీర్థం దగ్గర శివునకు కపిలేశ్వర దేవాలయం కలదు భక్తులు కొండ ఎక్కుటకు ముందు ఈ కపిల తీర్థంలో స్నానం చేయడం అలవాటు.



తిరుమల రథోత్సవం

తిరుపతికి 5 కి మీ. దూరంలో తిరుచానూరులో శ్రీ పద్మావతిదేవికి అంకితమైన దేవాలయం కలదు. శ్రీవారి ధర్మపత్ని శ్రీ పద్మావతి దేవి. ఈమే తిరుచానూరు అలమేలు మంగ.

ఏనాటి కానాడు పెరిగిపోతున్న తిరుమల దేవాలయం ఆదాయంతో దేవస్థానమువారు అనేక అభివృద్ధి కార్యక్రమాలు, వసతి సౌకర్యాలు చేపట్టారు. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం 1954 లో స్థాపించబడింది. మత



అన్నమాచార్య

ధర్మ, సాంఘిక, విద్యా కార్యక్రమాలను ఎన్నిటినో కొనసాగిస్తున్నారు. సాంస్కృతిక కార్యక్రమాభివృద్ధికి దేవస్థానంవారు అన్నమాచార్య పీఠాన్ని స్థాపించి, అన్నమాచార్య సంకీర్తనలను ప్రచారంచేయించి. ప్రతి ఏటా అన్నమాచార్య ఉత్సవాలను అతి వైభవోపేతంగా జరుపుతున్నారు. రాగిరేకులమీద చెక్కి ఉంచిన అన్నమాచార్య సంకీర్తనలను దేవస్థానం వారు ప్రకటించి మహోపకారం చేసారు. ఈనాడు ఆంధ్రప్రదేశ్‌లో తిరుపతి ఒక విద్యాపీఠంగా, కళాకేంద్రంగా ఆవిర్భవించింది.

"దేశాభ్యుదయానికి ప్రాణత్యాగం కంటే
దేశ ఔన్నత్యానికి పాటుపడి జీవించడం మేలు."

# మెదడు పక్షవాతం

శ్రీమతి భారతి జోషి

సెరిబ్రల్ పాల్సీ (మెదడు పక్షవాతం) ప్రపంచం అంతటా పిల్లలను పట్టి పీడిస్తూంది. దీనికి భారతదేశం కూడా ఏమాత్రం తీసిపోలేదు. రమారమి 4 శాతం పిల్లలు



దీనికి గురి అయిన వారే. కాని వీరి విద్యా సౌకర్యాలకుగానీ, ఇతర సంక్షేమ కార్యకలాపాలకు గానీ తగిన చర్యలు తీసుకోబడటం లేదు.

సెరిబ్రల్ పాల్సీ మెదడులో కలిగే విపరీత పరిస్థితివల్ల శరీరంలో వివిధ కండరాలు మనసు సందేశాలను అనుసరించి సమన్వయంగా పనిచేయవు. అందుచేత ఈ జబ్బుగల పిల్లలు గుడ్డతో కుట్టిన బొమ్మల్లా ముద్దుగా ఉన్నా బిగుసుకుపోయి చైతన్యత కనిపించదు.

బాగా దాహం వేస్తుంది. దగ్గరగా ఉన్న మంచినీళ్ళ గ్లాసు తీసుకోడానికి ప్రయత్నిస్తాడు. పట్టుకుంటాడు. మెదడు 'తీసుకో' అని ఆదేశిస్తుంది. సందేశ మిస్తుంది కాని చేతులు సరిగా పనిచేయవు. చేతులు లేవవు. నీళ్లు ఒలికి పోతాయి. దాహం తీరదు. చీదరించుకుంటాడు ఇది ఒక సెరిబ్రల్ పాల్సీ బాలుని లక్షణం.

వాస్తవంగా ఇది రోగం కాదు. మెదడులో కేంద్రనాడీ విధానం సరిగా పనిచేయకపోవడం వల్ల ఏర్పడ్డ ఒక అవస్థ. దీనివల్ల కళ్లు సరిగా కనిపించవు చెవులు సరిగా పనిచేయవు. మాటలు సరిగా రావు. మతి చెడిపోతుంది. విపరీతంగా ప్రవర్తిస్తారు. పుట్టడానికి ముందుగాని, పుట్టిన తరువాతగాని, పుట్టుకలో గాని ఈ అవస్థ రావడానికి అవకాశం ఉంది. దీని వల్ల అనేక వైషమ్యాలు ఏర్పడవచ్చు.

విడవకుండా నిరంతరమైన శారీరక

(మిగతా 24 వ పేజీలో)

## తాను నిర్మించిన బ్రిడ్జికి తానే ఆహుతి!

ఆర్టెహ్యూలా అనే ఇంజనీరు స్పెయిన్‌లో రోన్డా బ్రిడ్జి నిర్మించాడు. ఆ బ్రిడ్జి మీదనుంచి పడి మరణించిన వారిలో ఇతడే ప్రథముడు.

"విశ్వ చైతన్యంతో ప్రకాశించే ఆత్మకు కుల తత్వాలు లేవు." —శంకరాచార్య

# ఐస్‌క్రీమ్

ఊరిలో ఏమూల చూసినా ఐస్‌క్రీమ్‌పార్లర్లే. అందరూ ఐస్‌క్రీమ్‌కోసం ఆనందంగా తినే వాళ్ళే. వేసవికాలమే అక్కర్లేదు. ఏ కాల మైనా సరే పెద్దవారి దగ్గర నుంచి పిల్లలదాకా అందరూ దీన్ని చూస్తే వదలరు. అందరికీ వావల్యం.



రోము చక్రవర్తి నీరో మొట్ట మొదట దీనిని ప్రారంభించాడని కొందరు ఊహి స్తారు. మంచుగడ్డ మీద పళ్ళ రసాలు, తేనె పోసి అనేక రకాలుగా తయారు చేయించు కుని త్రాగుతూండేవాడు. అలెగ్జాండరు రక రకాల పళ్ళరసాలు ఐసులో చల్లబరచి తింటూండేవాడు

కాని ఐస్‌క్రీమ్ వాస్తవంగా కనిపెట్టిన ఘనుడు డెమార్కో. ఇతడు ఇంగ్లండు చక్రవర్తి చార్లెస్ I దగ్గర వంటవాడు. ఒక రోజు ఇతడు చక్రవర్తికి ప్రత్యేకంగా గడ కట్టిన పాలు ఇచ్చాడు.

చక్రవర్తి దాని రుచికి మెచ్చుకుని అతడికి నెలకు 500 పౌండ్ల పెన్షన్ కూడా మంజూరు చేసాడు. ఊరికే కాదు - ఇక ముందు కూడా ఈ కిటుకు రాజ రహస్యంగానే ఉంచాలని ఆదేశించాడు.

జనవరి 30, 1649 లో చార్లెస్-I ఉరి తీయబడ్డ తరువాత డెమార్కో తన రహ స్యాన్ని బయటపెట్టాడు. అతి శీఘ్రంగానే ఇంగ్లండులో, ఇటలీలో, ఫ్రాన్స్‌లో ధన వంతుల కిది భోగంగా పరిణమించింది. ఇది

## ముఖచిత్ర వ్యాఖ్య

(మే 1985)

"అందమైన ఈ లత
ఈసారి 'విస్డమ్' ప్రత్యేకత"
—బి సోమశేఖర్, ఒంగోలు.

* * *

"సంప్రదాయ బద్ధమైన అలంకారం
ద్విగుణీకృతమైన నీ అందం"
—పొన్నలూరి జానకిరామ్, ఒంగోలు.

* * *

"కలలుగనే వయ్యారీ
నీ కలలన్నీ నిజం కావాలి"
—ఎమ్ విజయలక్ష్మి, అచ్చంపేట.
(గుంటూరు జిల్లా)

"మృతియును జీవనంబు వివిమేదినిలోపల జీవకోటికిన్
సతతము సంభవించు సహజంబిది."

తయారుచేయడం అంత సులభంకాదు. చాలా వ్యయ ప్రయాసలతో కూడినది.

ద్రవ రూపంలో ఉండే మిశ్రమం గట్టిపడేదాకా చేతితో చిలకాలి. గట్టిపడిన తరువాత మూత ఉండే పాత్రలో పెట్టి దీన్ని తిరిగి ఐస్, ఉప్పు కలిపి ఉంచిన పెద్దపెట్టిలో



పెట్టి తిరిగి చేతితో పైకి క్రిందికి గిలకరించేవారు. 1848 వ సం. లో అమెరికాలో నాన్సీ జాన్సన్ 'ఫ్రీజర్' (పాలను గట్టిపరచే సాధనం) కనిపెట్టాడు. వెంటనే అందరూ సులభంగా ఐస్‌క్రీమ్ తయారుచేసి అమ్మడం ప్రారంభించారు. అమెరికాలో 1900 సం. నాటికి సంవత్సరానికి సుమారు 50 లక్షల గాలనుల ఐస్‌క్రీమ్ తయారయేది.

1904 వ సం. లో సెంట్‌లూయిస్ (అమెరికా) లో వరల్డ్‌ఫెయిర్ ప్రారంభించారు. ఇక్కడ ప్రదర్శకతను ఐస్‌క్రీమ్‌ను వాఫర్స్ (waffers) తో కలిపి తయారుచేయడం కనిపెట్టాడు. ఆనాటి నుంచే ఐస్‌క్రీమ్ కోన్ ప్రారంభమైంది

ఈనాడు ప్రపంచం అంతటా 150 కి మించిన అనేక రకాల ఐస్‌క్రీములు తయారవుతున్నాయి ఐస్‌క్రీము పారిశ్రామిక రంగంలో ఎప్పటికప్పుడే క్రొత్త క్రొత్త రకాలు తయారుచేస్తున్నారు. ●

---

## గ్రామాలలో 100 కి 20 మందికే మంచినీళ్లు

భారతదేశంలో 80 శాతం పట్టణాలలో నివసించే వారికీ, 20 శాతం గ్రామీణులకు మాత్రమే మంచినీళ్ళు లభిస్తున్నాయని ఇటీవలి లెక్కలవల్ల తేలింది. దేశంలో ముగ్గురిలో ఇద్దరికి పరిశుభ్రమైన మంచినీళ్ళు దొరకడం ఇంకా ఒక కలగానే ఉంది!

---

(22 వ పేజీ తరువాయి

వైద్యం (మౌళిక వైద్యం) వల్ల బాలుని చేష్టలు క్రమబద్ధం చేయవచ్చు దీనికి సంబంధించిన వైద్యుడు (physiotherapist) రకరకాల వ్యాయామాలు చేయించి ప్రతీ అంగం బాగా పనిచేయడానికి ప్రయత్నింపజేస్తాడు. వ్రాసేటప్పుడు వ్రాత సాధకాలు సరిగ్గా చేత్తో పట్టుకోడానికి, టైప్‌రైటర్ ఉపయోగించడానికి తగిన అలవాట్లు కల్పిస్తాడు. మాటలు సరిగ్గా రానప్పుడు వాక్కుకు సంబంధించిన వైద్యుని (speech therapist) సంప్రదించాలి. ఒక్కొక్కరికి ఒక్కొక్క రకమైన విపరీత సమస్యలు ఉంటాయి. వ్యక్తిగతంగా వైద్య ఉపచారాలు చేయవలసి ఉంటుంది. ('ధమ్మ' సౌజన్యంతో) ●

"జీవుడు పరమాత్మ స్వరూపమున నిత్యుడు, అమరుడు" — శ్రీశంకరుడు

# వార్తాపత్రికల చరిత్ర

రాఘవేంద్రరావు

'వార్తలేమిమంచివార్త' అనే ఆంగ్ల సామెత వార్తాపత్రికలకు వర్తించనంత వరకూ మంచి సామెతగానే అనిపిసుంది.




అమాంతం మనం అసలు వార్తాపత్రికలే లేని ప్రపంచంలో దిగితే దీని అసలు అర్థం తెలుస్తుంది.

సుమారు 420 సంవత్సరాలకు పూర్వం ప్రపంచంలో వార్తాపత్రిక లనేవే లేవు. వార్తాపత్రిక మొట్టమొదట ఆనాటి ఆధునిక పద్ధతిలో 1566 సం.లో ప్రారంభమైంది. వెన్నిస్ (ఇటలీ) ప్రభుత్వంవారు వార్తలు 'న్యూసషీట్స్'గా వ్రాసి వీధులలో ప్రదర్శిస్తూ ఉండేవారు. ప్రజలదగ్గర 'గెజెటా' (Gazetta) అనే నాణెం వసూలుచేసి వార్తలు చదువుకోనిచ్చేవారు. అందుచేతే ఈ న్యూస్ షీట్స్‌కి 'గెజెట్స్' అని పేరు స్థిరపడింది. వీటికి రానురాను మంచి ఆదరణ కలగడంచేత వీటిని అచ్చువేయడం ప్రారంభించారు.

వార్తాపత్రికలు ఆధునికం అని చెప్పుకో తగ్గవి ప్రచురించటం ప్రారంభించి నాలుగు శతాబ్దాల కాలమైంది వార్తాపత్రికల లాంటివి రోమ్‌లో అతి ప్రాచీన కాలంనుంచి ఉన్నాయి. రోము సామ్రాజ్యంలో ముఖ్యంగా సైనిక వార్తలు, యుద్ధాలు, యుద్ధవిషయాలు మిలటరీ జనరల్స్‌కి 'ఆక్టాడయర్నా' (దిన చర్యలు) అను పేరుతో రిపోర్టులు పంపబడేవి. ఈ మిలటరీ జనరల్స్ ఆయా ఆఫీసర్లకు ఈ రిపోర్టులు అందజేస్తూ ఉండేవారు. 'ఆక్టాడయర్నా' సామాన్య మానవుడికి ఉప

## అరచేతి సైజులో కంప్యూటరు

రష్యాలో ఎస్టోనియా రిపబ్లిక్ శాస్త్రజ్ఞుల అభిప్రాయం ప్రకారం మానవుని అరచేయి సైజులో కంప్యూటరు డిజైను చేయవచ్చు ఇందులో ఎలిమెంట్లుగా విడి విడి మాలిక్యూల్స్ పనిచేస్తాయి లేసర్ల సహాయంతో వివరాలు తెలుసుకోబడతాయి.

"విజయమెప్పుడూ ఆత్మగర్వాన్నీ
అసహనాన్నీ తనవెంట తెస్తుంది"

యోగ పడకపోయినా ఇవి వార్తలే అని చెప్పుకోవాలి. ఈ విధంగా పరిశీలిస్తే అతి ప్రాచీనమైన వార్తాపత్రికలు బాబిలోనియా, అస్సీరియాలలో రాళ్ళమీద చెక్కిన వార్తలు. వీటిలో ప్రప్రథమమైనది సైలోమ్ శిలా శాసనం - జెరూసలంకు ఆగ్నేయ దిక్కుగా




సైలోమ్ సరస్సులో లభించింది. దీని మీద ఫోనీషియన్స్, హిబ్రూస్, మోబైట్స్ లిపిలో అక్షరాలు ఉన్నాయి.

వెన్నిస్‌లో 'గెజిటా' ప్రారంభమైన అర్ధ శతాబ్దానికి అంటే 1622 సం.లో లండన్ నగరంలో ఆంగ్లేయ వార్తాపత్రిక 'వీక్లీ న్యూస్' పుట్టింది. ఇది అంతరించి చాలాకాలం అయినప్పటికి 1645 లో స్థాపించబడ్డ పోస్ట్ ఆక్ ఇన్‌రిక్స్ టెడ్‌నిన్‌గార్ అనే స్వీడెన్ దేశపు అధికార జర్నల్ నేటికీ ప్రచురింప బడుతూంది. అతిప్రాచీనమైన కమర్షియల్ న్యూస్ పేపరు కౌరంట్ జనవరి 8, 1618లో నెదర్లాండ్స్ హార్‌లెమ్‌లో వెలువడింది. దీని నెం. 1 సంచిక ప్రతి ఇంకా ఉంది.

భారతదేశంలో మొదటి వారాపత్రిక జనవరి 27, 1780 లో జేమ్స్ హికే ప్రకటించిన 'బెంగాల్ గెజెట్'. అన్ని పార్టీలకు సమానావకాశం ఉన్నా ఏ పార్టీ ప్రభావం లేదనే సూత్రం మీద నడపడంచేత ఇది ఒక సంవత్సరం కంటే ఎక్కువకాలం ఉండలేదు.

హికే గెజిట్ తరువాత నూరు ఏళ్ళలో దాదాపు ఆరు పత్రికలు పుట్టాయి. కాని అవి అప్పుడే మూసివేయబడ్డా . ఇవన్నీ ఆంగ్లేయులు భారతదేశంలో ఆంగ్లేయుల కోసం ప్రారంభించినవే.

బ్రిటిషువారు భారతదేశం వదలిన తరువాత 'బ్రిటిష్ ప్రెస్ ఆక్ట్' సవరింపబడింది. 1947 సం.లో భారతదేశం స్వాతంత్ర్యం ఏర్పడింది. ఆనాటికి దేశంలో మొత్తం 3,000 వార్తాపత్రికలు, రకరకాల వార, పక్ష, మాస పత్రికలు ఉన్నాయి. వీటిలో వార్తాపత్రికలు 300 మాత్రమే. 1975 సంవత్సరం నాటికి ఈ సంఖ్య 12,423 కి పెరిగింది.

ఈనాడు భారతదేశంలో 18,000 వార్తాపత్రికలు ఉన్నాయి. ఆంగ్లేయ పత్రికలలో అతి ప్రాచీనమైనది 1838 సం. లో స్థాపించబడిన 'ది టైమ్స్ ఆఫ్ ఇండియా'. 1865 సం లో 'పయొనీర్', 1868 సం. లో 'అమృత బజార్ పత్రిక', 1875 సం. లో స్టేట్స్‌మన్, 1876 సం. లో 'ది హిందూ'

---

## పూర్తిగా మహిళలే నిర్మించిన చర్చి

ఫ్రాన్స్ సీన్ ద్వీపంలో చర్చి పూర్తిగా మహిళలచేతే నిర్మింపబడింది. ఇందులో ప్రతి ఇటుక, కలప వీరు మోసినదే.

---

"తెలివిలేని బాటసారి రెక్కలులేని పక్షి" —గులిస్తాన్

స్థాపించబడ్డాయి. స్థానిక భాషలలో అతి ప్రాచీనమైనది గుజరాతీ భాషలో ప్రచురించబడే 'బొంబాయి సమాచార్'. ఇది 1822 సం. లో బొంబాయిలో స్థాపించబడింది.

ఇన్ని వార్తాపత్రికలు దేశంలో ఉంటున్నా, వార్తాపత్రికలపట్ల మనకు ప్రపంచంలో ఇతరులకు ఉన్నంత ఆసక్తిగాని, పఠనాభిలాష గాని కనిపించదు. దీంట్లో అగ్రతాంబూలం స్వీడెన్ వారిది. ఇక్కడ ప్రతి 1000 మందికి 551 వార్తాపత్రికలు అమ్ముడు బోతున్నాయి. ప్రపంచంలో అత్యధికంగా చెలామణి అవుతున్న పత్రిక 1874 లో స్థాపించబడిన జపాన్ వారి 'యొమూరి షిమ్‌బున్' (Yomiuri Shimbun) ఏప్రిల్ 1, 1983 న ఈ పత్రిక 1,40,16,723 ప్రతులు ప్రచురింపబడింది.

భారతదేశంలో 85 ఆంగ్లేయ వార్తాపత్రికలు ఉంటే అమెరికాలో 1,730 ఉన్నాయి. ఈ పత్రికల సర్క్యులేషన్ రోజుకి సుమారు 61,14,30,745. వీటి అన్నిటిలో ఎక్కువ ప్రజాదరణ గల పత్రిక 'న్యూయార్క్ టైమ్స్' ఈ పత్రికకి రోజుకి 9 లక్షల కాపీల సర్క్యులేషన్ ఉంది. వాస్తవానికి న్యూయార్క్ టైమ్స్ అక్టోబరు 17, 1965 నాటికి రికార్డు స్థాయిని అందుకుంది. ఆనాడు ఈ పత్రిక 946 పుటలతో 3½ కి. గ్రా భారంతో వెలువడింది.

ఆధునిక జర్నలిజంలో ఇటీవలి వరకు భారతదేశం దీర్ఘకాలిక సంపాదకత్వం (Longest Editorship) లో ప్రపంచ రికార్డు స్థాపించింది. సెప్టెంబరు 17, 1917 నుంచి మార్చి 28, 1981 వరకు, ఎమ్.ఎస్. కృష్ణారావు (1895-1981) మైసూరు 'సత్యవాది', సంపాదకత్వాన్ని వహించారు.

ఏప్రిల్ 1, 1919 నుండి 'నస్యూస్ ట్రిబ్యూన్' (Nassau's Tribune) కు సంపాదకులుగా ఉన్న సర్ ఎటిన్ డ్యూపుచ్ అక్టోబరు 1982 లో ఈ రికార్డును అధిగమించారు.

ఈనాడు వార్తాపత్రికలు మన నిత్యజీవితంలో అత్యవసర వస్తువుగా పరిణమించాయి. వార్తాపత్రిక లేకపోతే ప్రాణం పోయినట్టే అనిపిస్తుంది. ఎంత మోజున్నా టెలివిజన్ సెట్ వార్తాపత్రికతో సమానం కాజాలదు. ప్రొద్దున్నే నిద్ర లేవడంతోటే వేడి వేడి కాఫీతోపాటు వార్తాపత్రికతో పొందే ఆనందం టీవితో పొందలేం!

## మిక్కిలి నిడివైన రెక్కలు గల గబ్బిలం



న్యూగినియా మరియు బిస్మార్క్ అర్చిపెలాగోలో కనిపించే బిస్మార్క్ ఫ్లైయింగ్ ఫాక్స్ గబ్బిలాల రెక్కలు మిక్కిలి పెద్దవి. 6 అడుగుల నిడివిగా ఉంటాయి.

"కొమ్మ ఎలా వంచినా వంగుతుంది." —చైనా సామెత

# కార్టూనులు గీయటం ఎలా?

టి. వెంకటరావు

## 44

## డ్రాయింగు స్టయిలులు

**లైను బొమ్మలు:** ఈ బొమ్మలు ముఖ్యంగా ఒకే నల్లనిఛాయ (Dark Tone)



Line illustration

లేక రంగు ఛాయలో ఇండియన్ ఇంక్‌తో వేస్తారు. ఇక్కడ ఛాయా భేదా లుండవు. కంటికి ఛాయలా కనిపించడానికి, ఛాయలు స్పష్టంగా ఉండడానికి సమానాంతర రేఖలు గీస్తారు లేక క్రాస్ హాచింగ్‌గా సమానాంతరంగా గీతలు గీస్తారు వాష్ డ్రాయింగులో లాగ నీరు కలిపిగానీ, తెల్లరంగు కలిపిగానీ ఛాయని లేత వర్ణం చేయరు ఇటువంటి డ్రాయింగులు లెటర్ ప్రెస్‌లో లైన్ ఎంగ్రేవింగ్ విధానంలో అచ్చు వేయబడతాయి.

**హాఫ్‌టోన్ బొమ్మలు:** ఈ బొమ్మలలో అనేక ఛాయలు వస్తాయి. నల్లటి నలుపు నుండి తెలుపువరకు గల అనేక ఛాయలు వస్తాయి. వాష్ డ్రాయింగులవల్ల, ఫొటోగ్రాఫులవల్ల, మానో క్రోమ్ (ఒకే రంగు) పెయింటింగులవల్ల ఈ బొమ్మలు ఏర్పడతాయి. ఇవి లెటర్‌ప్రెస్‌లో హాఫ్‌టోన్

---

## 55 లక్షల బీడీలు ఒక్క నెలలో

భారతదేశం గ్రామాలలో విస్తారంగా బీడీలే కాలుస్తారు. ఒక్క నెలలో 55,00,000 బీడీలు కాలిస్తే సిగరెట్లు 5,50,000 కాలుస్తారు.

"అసాధ్యరోగముల యందు భగవన్నామ స్మరణ కన్న వేరే ఔషధం లేదు." —లోలంబరాజీయం

ఎంగ్రేవింగ్ విధానంలో అచ్చువేయడానికి సిద్ధం చేయబడతాయి.



Wash illustration

రంగుల బొమ్మలు: వాటర్ కలర్స్, పోస్టర్ కలర్స్, ఆయిల్ పెయింటింగ్స్, క్రెయానులు. పాస్టెల్స్ Pastels) వగైరాలతో వేయబడే రంగు రంగుల బొమ్మలను పెయింటింగులు లేక కలర్ కార్టూనులు అంటారు. ఇవి ఆఫ్‌సెట్ ప్రెస్‌లో కలర్ ఎంగ్రేవింగ్ విధానంలో అచ్చువేయడానికి సిద్ధం చేయబడతాయి. లైన్‌లలో వేసే బొమ్మలు. హాఫ్‌టోన్ బొమ్మలు ఎంగ్రేవింగ్ అవసరం లేకుండా ఆఫ్‌సెట్ ప్రెస్‌లో కూడా అచ్చు వేయవచ్చు.

ఒక చిన్న గమనిక: గత అనేక మాసాల నుంచీ కార్టూనులు గీయడం నేర్చుకున్నారు. మంచి కార్టూను చిత్రకారుడిగా అభివృద్ధి పొందాలంటే కష్టపడి పనిచేయాలి. అభ్యాసంవల్లే నైపుణ్యత కలుగుతుంది! ●

# జార్జి జూనియర్ రిపబ్లిక్ వాస్తవ్యులంతా యువతీ యువకులే!

న్యూయార్కు (అమెరికా) ఫ్రీవిల్లీలో స్థాపించిన 800 ఎకరాల వైశాల్యం గల రిపబ్లిక్ ప్రపంచంలోనే మిక్కిలిచిన్నది. ఇచ్చటి వాస్తవ్యులంతా 13 నుండి 21 సంవత్సరాల మధ్యవయస్సులో ఉండే యువతీ యువకులు. వీరిలో శ్రీమంతులు, మధ్యతరగతికి చెందిన వారు, సాధన సంపత్తులు లేనివారు అందరూ ఉన్నారు. విలియం ఆర్. జార్జి అనే గొప్ప పారిశ్రామిక ఉత్పత్తిదారుడు 1895 లో స్థాపించిన ఈ రిపబ్లిక్‌ను జార్జి జూనియర్ రిపబ్లిక్ అంటారు ఇక్కడ కాటేజీలు, స్కూళ్ళు, షాపులు, పోలీసు విభాగం, న్యాయస్థానాలు, బ్యాంకులు ఒక చిన్న వ్యవసాయక విభాగం ఉన్నాయి. ఈ రిపబ్లిక్‌లో ఒక పూట చదువు సంధ్యలకు వినియోగిస్తారు. యువతీ యువకులు పెద్దవాళ్ళలాగ ఉద్యోగాలు చేస్తారు. జీవితం పోషించుకోడానికి రిపబ్లిక్ నిర్వహణ, వ్యవసాయం, ఖారీ పరికరాల నిర్వహణ, పింగాణీ తయారీ మొదలైన పనులన్నీ ఈ యువకులే నిర్వహిస్తారు. ఇక్కడ శిక్షణపొందిన యువకులు లాయర్లు, ఆర్టిస్టులు, వ్యాపారస్థులు ఇంజినీరులు, హస్తకళానిపుణులు, ఉపాధ్యాయులు వంటి వృత్తులు చేపట్టారు. ఈ రిపబ్లిక్ సహకారం లేకపో తేవీరంతా చెరసాలలోనూ, రిఫర్మేటరీలలోను ఉండవలసినవారే.

"నిజమైన నటునికి నాటకరంగమే జీవిత సర్వస్వం." —స్టానిస్ స్కీ

# అవీ-ఇవీ

**గిర్ సంరక్షక వనాలలో 205 ఏషియన్ సింహాలు:**

గుజరాత్‌లో ఏర్పరచిన గిర్‌వన్య మృగ సంరక్షక వనంలో ఆసియా సింహాల సంఖ్య



గత 10 సంవత్సరాలలో 180 నుంచి 205 కి పెరిగింది. పడమటి ఆసియా నుంచి భారత దేశం ఉత్తర ప్రదేశాల వరకు గల విస్తృత ప్రదేశాలలో కొన్ని వందల సంవత్సరాల ముందు విచ్చలవిడిగా ఈ సింహాలు సంచరించేవి.

• • •

**ముడుపు వెంట్రుకల మీద ఆదాయం రూ. 25 లక్షలు:**

భారతదేశం అన్నిమూలల నుంచి భక్తులు తమ మొక్కుబడులను తీర్చుకోడానికి తిరుమల తిరుపతి శ్రీనివాసునికి తమ తల నీలాలను సమర్పిస్తారు. ప్రపంచంలో ఎక్కువగా మానవుల తల వెంట్రుకలను సేకరించే ప్రదేశం ఇది ఒక్కటే. తిరుమల తిరుపతి దేవస్థానం వారు సాలీనా నిర్వహించే నీలాల అమ్మకం వల్ల ఈ సంవత్సరం తేలిన ఆదాయం రూ. 25 లక్షలు

• • •

**రష్యా చారిత్రక గంట పునస్థాపన:**

రష్యా క్లెట్స్కి బైలోరష్యన్ నగరంలో చారిత్రాత్మకమైన చర్చిగంట బరువు 1.5 టన్నులు. (1 టన్ను స్వచ్ఛమైన వెండి). ఇది తిరిగి బాగుచేయబడింది. ప్రాతఃకాలం ఇక్కడ గంట మోగిస్తే 30 కి మీ దూరం వినిపిస్తుంది. దీన్ని 1705 లో తయారు చేసారు.

• • •

**పశ్చిమ జర్మనీనుండి రోడ్డు నిర్మాపక యంత్రం:**

బొంబాయిలో రోడ్ల నిర్మాణం ఆధునీకరణం చేయడానికి క్రొత్తగా అట్లాంటా కన్‌స్ట్రక్షన్ కంపెనీ పశ్చిమ జర్మనీ నుండి అధునాతనమైన రోడ్డు నిర్మాపక యంత్రాన్ని కొన్నారు. రోడ్లను శాస్త్రయుక్తంగా వేయడమే గాక దీనివల్ల ఖర్చులో 40 శాతం ఆదా కూడా అవుతుంది.

"విశాల హృదయులకు లోకమంతా విశ్వైక కుటుంబం" —హితోపదేశం

# లుకు

జగత్ ఎస్. బ్రైట్

## 3

కలుసుకోవాలన్న చోట తప్పకుండా కలుసుకుని తీరుతాం:

మనం ఒక స్నేహితుణ్ణి తప్పకుండా కలుసుకొని తీరాలి అని మనస్సులో తీవ్రంగా నిరయించుకుంటే కలుసుకోవలసిన చోట తప్పనిసరిగా కలుసుకుని తీరతాం తీవ్రమైన మానసిక నిర్ణయం జరిగి తీరుతుంది. నిరాశ పొందం

ప్రజ్ఞాశక్తులను సద్వినియోగం చేసుకోవాలి

ఇతరుల శ్రేయస్సుకోసం మన ప్రజ్ఞాశక్తులను ఉపయోగించుకోవాలే గాని వృధాగా వ్యయం చేసుకోకూడదు.

• • •

సుదీర్ఘ యాత్రకు సిద్ధం చేసుకోవాలి:

మానవులు చిన్న చిన్న ప్రయాణాలను పెద్దపెద్ద ప్రయత్నాలతో, ఆర్భాటాలతో సిద్ధం చేసుకుంటారు. కాని తిరిగి రానట్టి సుదీర్ఘ ప్రయాణానికి ప్రయత్నాలు చేసుకోరు.

జీవితంలో ఉత్తమ విద్య:

ఉత్తమ భావాలు దిఙ్మండలాలను అధిగమించి ప్రయణాలు చేస్తాయి. కాబట్టి ఇటువంటి సద్భావాలనే ఎప్పుడూ పెంచుకోవాలి

• • •

కాంతిమాత్రమే సౌందర్యాన్ని సృష్టించలేదు:

చీకట్లు కాంతులు సమ్మిశ్రితమైతేనే స్వారస్యం చీకటి లేకుండా కాంతి ఒక్కటే సౌందర్యాన్ని సృష్టించలేదు కాంతి పుంజాలు చీకట్ల మీద ప్రసరిస్తేనే సౌందర్యం

• • •

సత్యాన్ని అన్వేషించండి:

నిజమైన ఆస్తికుని దైవం, నాస్తికుని దైవం ఒక్కటే "సత్యాన్ని అన్వేషించండి. సత్యాన్ని అనుసరిస్తే నిజం నిన్ను సంరక్షిస్తుంది" అన్నాడు జీసను (సశేషం)

---

## అతి నాగరికతవల్లే అధికరోగాలు

పూర్వం ప్రపంచంలో జనసంఖ్యతక్కువ ఉండే రోజుల్లో రోగాలు చాలా తక్కువగా ఉండేవి. జనాభా పెరిగిపోయి, పెద్ద పెద్ద పట్టణాలలో జనం క్రిక్కిరిసిపోయి నివసిస్తూ ఉండడంవల్ల, నూతన సంస్కారాలవల్ల క్రొత్త క్రొత్త రోగాలు బయలుదేరాయి. వారి శరీరాలలో క్రొత్త రకం సూక్ష్మజీవులు చేరాయి. —'ది స్కార్లెట్ ప్లేగ్'

# ధనానికి బలానికి పొంగిపోకు

నీ సౌభాగ్యాన్ని చూచుకుని నీవు మురిసిపోవద్దు నీవు పెద్ద ధనవంతుడవని అనుకుంటే నీకంటే ధనవంతులైనవాళ్ళు ఒకరిని మించిన ఒకరు ఎంతోమంది ఉన్నారు. వాళ్ళందరితో సరిపోల్చి చూసుకుంటే నీవొక నిర్భాగ్యుడవే. సంధ్య పడిన తరువాత మిణుగురు



శ్రీరామకృష్ణ

పురుగులు బయలుదేరుతాయి ఇవి తమ వెలుగుకి మురిసిపోయి 'ప్రపంచానికంతా మేమే వెలుగును ప్రసాదిస్తున్నాం' అనుకుని గర్విస్తాయి

ఇంతలో ఆకాశంలో నక్షత్రాలు మిణుకు మిణుకుమంటూ ప్రకాశిస్తాయి. మిణుగురు పురుగుల గర్వం అణిగి ఊరుకుంటుంది. నక్షత్రాలు తామే లోకానికంతా వెలుగును ఇస్తున్నామని అనుకుని ఉబ్బిపోతూ ఉంటాయి కొంతసేపటికే క్రొత్త హొయలుతో చందమామ ఉదయిస్తుంది. చల్లని పుచ్చపూవులవంటి వెన్నెల కాస్తుంది. చంద్రకాంతిలో నక్షత్రాలు వెలవెలపోతాయి. నక్షత్రాల మదం అణిగిపోతుంది. చందమామ సగర్వంగా తన వెన్నెల ప్రభావంచేతే లోకమంతా వెలుగు మయంగా ఉంది అని అనుకుంటుండగానే తూర్పున వెలుగు కిరణాలను ప్రసరిస్తూ సూర్యుడు ఉదయిస్తాడు. ఇప్పుడు చంద్రుడు ఎక్కడ? చంద్రుని చల్లని వెన్నెల ఎక్కడ?

ఎవరికి వారే భాగ్యవంతులమనుకునేవారు ఈ ప్రకృతి రహస్యాలను జాగ్రత్తగా పరిశీలిస్తే మీ శక్తి సామర్థ్యాలకు, సౌభాగ్యాలకు పొంగిపోరు

వారధి క్రింద నదీజలాలు ప్రవహిస్తూ పోతూ ఉంటాయి. నీళ్లు అక్కడ నిల్వ ఉండవు. ఉదారవంతుల చేతులలో డబ్బు నిలువఉండదు — భగవాన్ శ్రీరామకృష్ణ

## శ్రీలంక జనాభాలో 49.5% మహిళలు

160 లక్షల జనాభాగల శ్రీలంకలో 49.5 శాతం మహిళలు. పది సంవత్సరాల ముందు మహిళల శాతం 42.5.

"మాట తిరుగలేరు మానధనులు." —భాగవతం

# కలం స్నేహితులు

[మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురించబడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5/— లు మనియార్డరు ద్వారా పంపండి. —సంపాదకుడు]

1. డి.డి. రాజేంద్ర ప్రసాద్ సెక్రటరీ: వరల్డ్ పీస్ ఫాల్స్ సర్వీస్, ఎస్.బి/47, విజయపురి సౌత్. నాగార్జునసాగర్-522 439.

సోషల్ సర్వీస్, 'మానవతా' దృక్పథంతో ఆలోచించడం, శాంతి సమైక్యతకు ప్రోత్సాహం.

2. పి.సి. ప్రకాష్, 22 సం. లు, లేడీస్ టైలర్ మాస్టర్, పోస్ట్ బాక్స్ నెం. 111, అల్ — బాదాయా — వస్త్ర, సౌది అరేబియా.

పూలచెట్లు పెంచడం, విజ్ఞానదాయకమైన పుస్తకాలు చదవడం, డిస్కో డాన్స్ చేయడం.

3. తాతపూడి జ్యోతిబాబు, ఎడిటర్: 'విముక్తి క్రైస్తవ మాసపత్రిక', 10-5-76/14B, తుకారాం గేట్, నార్త్ లాలాగూడా, సికింద్రాబాద్-500 017.

కవిత్వం, కలం స్నేహం, యువకవులను ప్రోత్సహించడం.

4 పి. వి రామరాజు, బి. ఎస్‌సి., 22 సం. లు, ఫరీద్ పేట-532 005, గుజరాతీ పేట, వయా, (శ్రీకాకుళం జిల్లా).

చదరంగం, కలంస్నేహం, పుస్తక పఠనం.

5. జి. భీమ్‌రెడ్డి, S/o లక్ష్మణ, కుమారి గ్రామం. నేరేడికొండ వయా, బోద్ తాలూకా, (ఆదిలాబాద్ జిల్లా).

తప్పును వ్యతిరేకించడం, కలంస్నేహం, రచనలు చేయడం.

## హాలీ తోకచుక్క ఫొటోగ్రాఫ్



సైయిన్స్ షాన్ మౌంటెన్స్ రష్యా, కజగస్థాన్ నక్షత్ర పరిశోధనశాలల పరిశోధకులు వచ్చే సంవత్సరంలో కనబడే హాలీ తోకచుక్కను ఫొటోగ్రాఫ్ తీశారు. ఈ తోకచుక్క తల చాలా వింతగా ఉంటుంది. పరిశీలించడం కూడా చాలా కష్టం. తోకచుక్క సూర్యుని సమీపించే కొద్దీ ఇక్కడే భయంకరమైన విస్ఫోటకాలు ఏర్పడతాయి.

"ఒరుల తప్పులెన్నువారు తమతప్పు లెరుగరు."

# మీకు ఎంత తెలివి ఉంది?

సాధారణంగా 20 సంవత్సరాల వయస్సు వచ్చేటప్పటికి మన శరీరంలో అవయవాలు ఇక పెరగవని అంటారు కాని శరీరంలో వివిధ అంగాలు పెరగకపోయినా కొందరికి తలలు పెరుగుతూ ఉంటాయి. ముఖ్యంగా ఇది



ప్రముఖ వ్యక్తులలో కనిపిస్తుంది. బ్రిటన్‌లో గ్లాడ్‌స్టన్ ప్రధాన మంత్రిగా ఉన్నప్పుడు ఆయన తల ఒక అంగుళం పెరిగినట్లు చెప్పబడింది. అలాగే లాయడ్ జార్జి తల పెరగడమే కాక ఆకారం కూడా మారిపోయింది.

ఈజిప్టు ప్రాచ్యవస్తు పరిశోధకుడు సర్ ఫ్లిండర్స్ పెట్రీ 21 వ సం రం. వయస్సు నుండి 50 వ సం.రం వయస్సు వచ్చేటప్పటికి 6¾ సైజుండే అతడి టోపీ 7¼ సైజు అయింది. ఆ తరువాత అతను ప్రత్యేకంగా టోపీలు తయారుచేయించుకోవలసి వచ్చింది.

మానవుని మేధస్సు పెరిగినా మేధస్సుకు తగినట్లుగా తల పెరగాలని నియమం లేదు.

మానవ పుర్రెలను, కపాలాలను గురించి విశేష పరిశోధనలు సలిపిన సర్ ఆర్థర్ కీట్ అభిప్రాయం ప్రకారం ప్రాచీనకాలపు మానవుల పుర్రెలు చాలా చిన్నవిగా ఉండేవి. తల ఎంతమాత్రం పెరగకుండా ఆధునిక మానవుడు మేధస్సు శక్తిని, చురుకుదనాన్ని రెండింతలు అధికం చేసుకోవచ్చు అని ఈయన అంటారు.

ప్రాచీనకాలపు మానవుని మెదడు ఒక

## సాంకేతిక పదాలు

CART : కౌన్సిల్ ఫర్ అడ్వాన్స్‌మెంట్ ఆఫ్ రూరల్ టెక్నాలజీ.

AICS ఆల్ ఇండియా కౌన్సిల్ ఆఫ్ స్పోర్ట్స్.

OECD : ఆర్గనైజేషన్ ఫర్ ఎకనామిక్ కో ఆపరేషన్ అండ్ డెవలప్‌మెంట్.

UNCTAD : యునైటెడ్ నేషన్స్ కాన్ఫరెన్స్ ఆన్ ట్రేడ్ అండ్ డెవలప్‌మెంట్.

UNDP : యునైటెడ్ నేషన్స్ డెవలప్‌మెంట్ ప్రోగ్రాం.

'విషాదాంతంలో శాశ్వతంగా కన్పించే ప్రతి నిముషం హాస్యాంతంలో క్షణికం." —క్రిష్టోఫర్ ఫ్రై

చిన్నకోతి మెదడంత ఉండేది. ప్రాచీన మానవుల మెదడు ప్రవృద్ధి నిర్మాణాన్ని గురించి అనేక అభిప్రాయభేదాలు ఉన్నాయి. చాలా పల్చగా ఉండే కపాలాల ఆకారాన్ని బట్టి వీటిని నిర్ణయించుకోవచ్చు. ప్రాచీన కాలపు మానవులకు కనుబొమ్మల అంచులు లేవు. క్రింది దవడ ముందుకు వచ్చి ఉండదు.

ప్రముఖ వ్యక్తుల మెదడు అసాధారణమైన రూపంలో ఉంటుందని వైద్యశాస్త్ర విపుణులు అంటారు. ముఖ్యంగా తల సైజుకంటె వైఖరినిబట్టి. రూపాన్నిబట్టి మేథస్సు ఉంటుంది. బాగా అభివృద్ధి పొందిన మెదడులో బొడిపెలు, ఎత్తు పల్లాలు చాలా ఉంటాయి.

సగటు పురుషుని మెదడు సుమారు 48 ఔన్సులు తూగుతుంది. స్త్రీల మెదడు 4 ఔన్సుల తక్కువ తూగుతుంది. దీనివల్ల పురుషునికి మేధాశక్తి ఎక్కువని కాదు. మొత్తం మీద స్త్రీ భౌతికకాయం పరిమాణం చిన్నది. పురుషుని మొత్తంభారంలో మెదడు భారం 1/60 వంతు ఉంటుంది. పెద్ద ఏనుగు మెదడు 15 పౌన్లు ఉంటుంది. ఏనుగు మొత్తం భారంలో ఇది 1/600 వంతు. ఈగలకు కాళ్ళమీద సూక్ష్మమైన మెదడు ఉంటుంది.

కొంతమంది సుప్రసిద్ధ వ్యక్తులకు సగటుగా ఉండే మెదడుకంటె చిన్న మెదడు ఉంటుంది. ఈ తరహాకి చెందినవారు అబ్రహాం లింకన్, కాల్విన్ కూలిడ్జి. వీరిద్దరూ అమెరికా మాజీ అధ్యక్షులే. ●

## మానవులకూ, చింపాంజీలకూ ఒకే వారసత్వం



అమెరికా మిన్నెసోటా యూనివర్సిటీ ప్రొఫెసర్ డా. డాన్‌హాన్‌సన్ మానవ శరీరంలో ఉండే కణజాలంలో క్రోమోజోముల అధ్యయనం వల్ల మానవుడికీ, చింపాంజీలకీ ఒకే వారసత్వమని, రేడియేషన్ ప్రక్రియతో క్రోమోజోముల పునర్వ్యవస్థీకరణ వల్ల మానవుడుగా పరిణామం చెందాడని సూచిస్తున్నారు. మానవుడికి కోతులకు మధ్య వీడిపోయిన సంబంధాన్ని 8 సంవత్సరాలకు పూర్వం ఇథియోపియా (ఆఫ్రికా) మానవ పరిణామ శాస్త్రజ్ఞుడు కనుగొన్నాడు. సుమారు 35 లక్షల సం. లకు పూర్వపు ఆడకోతి అవశేషాలను పరిశీలించి మానవుని అస్తిపంజరానికి దీనికి సమాన లక్షణాలున్నాయని తెలుపుతున్నారు.

"ప్రపంచ నాటక రంగంలో స్త్రీ పురుషులు ఎన్నెన్నో పాత్రలు అభినయిస్తూంటారు." —షేక్స్‌పియర్

# మీరు సంతోషంగా ఉన్నారా?

ఎస్. ఆర్. గోవిందరాజన్

వివేకవంతుడైన ఉద్యోగస్థుడు ఒకడు ఉండేవాడు. ప్రతిదినం సాయంకాలం సూర్యాస్తమయ మయేసరికి ఇతడికి ఎక్కడ లేని



విచారం, చింత, మనస్సులో కుమిలిపోయేవాడు. 'ఏమిటో నాకు ఏదో అయిపోయింది' అని భయపడి పోయేవాడు.

ఉండడానికి మంచి వసతి ఉంది. మంచి ఉద్యోగం ఉంది. అన్ని సుఖ సౌభాగ్యాలు ఉన్నాయి. స్నేహితులందరూ నన్ను అభిమానిస్తారు. క్లబ్‌లో అందరూ ఆప్యాయంగా మాట్లాడతారు. 'అయినా ఎందుకో! అబ్బ! ఈ విచారం. ఎందుకీ దుఃఖం!' అని అనుకుంటూ ఉండగానే దొడ్లో మల్లెపందిరి నుంచి మంచి సువాసనలతో పిల్లగాలులు వీస్తున్నాయి పందిరిమీదనుంచి కోకిల మధుర స్వరంతో నేను, నేను, నాది, నాది అనే కూత వినబడింది. షాకు తగిలినట్టు అయింది. అతడికి తెలియకపోలేదు. ఆ రోజు తను మాట్లాడినప్పుడు 'నేను', 'నాది' అనే పదాలు చాలాసార్లు వాడాడు. మనస్సు అంతా అహంభావంతో నిండిపోయింది.

ఇన్నిరోజులు తన గొప్పలు చెప్పుకుని పైకి రావాలని ఎంతో ప్రయత్నించాడు. మనస్సులో తను, తనవారు, తన గొప్పలు తప్ప మరోవిషయం లేనేలేదు. ప్రేమ, అనురాగం, సౌహార్ద్రత అనేవి పూర్తిగా ఇంకిపోయి అహంభావంతో తను, తన సౌఖ్యం, తన సౌభాగ్యం అనే ఆలోచనలే సదా మనస్సులో ప్రవహిస్తున్నాయి.

జీవితం దుర్భరమైపోయింది. విషపూరితమైపోయింది. అనవసరంగా తనను గురించి వ్యధపడినదాంట్లో ఒక్క నూరోవంతు ఇతరులను గురించి ఆలోచించి ఉంటే ఎంతో సౌఖ్యంగా మారిపోయి ఉండేది అతని జీవితం. ●

"ఒక వ్యక్తి తాను అనుభవించిన ఆనందాన్ని
ఇంకొకరిలో కలిగించడానికి చేసే ప్రయత్నమే కళ." —టాల్‌స్టాయ్

# భాధ్యత తెలిసిన సివంగి

సుమారు 200 సంవత్సరాలకు పూర్వం భారతదేశపు మధ్య, పశ్చిమ, ఉత్తర ప్రాంతపు అడవులలో అనేకచోట్ల విస్తారంగా తిరిగే సింహాలు ఇప్పుడు గుజరాత్ గిర్ అడవుల ప్రాంతాలలో మాత్రమే కనిపిస్తున్నాయి.



సాధారణంగా అడవులలో పొదలు ఎక్కువగా ఉన్న ప్రదేశాలలో సింహాలు సంచరిస్తాయి ఈ ప్రాంతాలను రెవిన్యూ బంజరు భూములుగా పరిగణించి పొదలు కొట్టి, భూములు వ్యవసాయయోగ్యంగా మార్చి, వ్యవసాయాభివృద్ధికై రైతులకు పంచి పెట్టారు. ఈ అడవులు అంతరించి పోవడంచేత, విచక్షణ లేకుండా వీటిని చంపుతూండటంచేత ఈ సింహాలన్నీ 1,300 చ. కి. మీ వైశాల్యం గల గుజరాత్ గిర్ అరణ్య ప్రదేశాలకు చేరుకున్నాయి.

సింహాలు ఇక్కడ 4 మొదలు 10 వరకూ చేరి గుంపులు గుంపులుగా తిరుగుతూ ఉంటాయి. ఈ జాతి అంతరించిపోతున్నది కాబట్టి ఇక్కడ వీటికి పూర్తిగా రక్షణ కలిగించారు.

సింహాలు కుటుంబ జీవనాన్ని అభిలషిస్తాయి. మగ సింహాలు తమ నివాసస్థలాన్ని సంరక్షించుకుంటూ ఉంటాయి. సివంగి (ఆడసింహం) సింహ కిశోరాలను రక్షించుకుంటూ ఆహారాన్ని వెదికి తీసుకువస్తుంది.

ఆడ సింహాలు సాధారణంగా 105 లేక 115 రోజులు చూలు కడతాయి. ఇవి ఒకే సారిగా వరుసగా మూడు నాలుగు కిశోరాలను కంటుంది. ఆసియా సింహం 2.92 మీటర్లు, ఆఫ్రికా సింహం 3.23 మీటర్లు పొడవు ఉంటుంది. ఆఫ్రికా సింహంకంటె ఆసియా

(మిగతా 40 వ పేజీలో)

## యూరప్‌లో పెద్ద మార్కెట్

యూరప్‌లో అతి పెద్ద మార్కెట్ ప్రష్యా (ప. జర్మనీ) ట్రూబర్గ్‌లో ఏర్పాటైంది. దీని వైశాల్యం 17½ ఎకరాలు.

"కళ ప్రజలకు చెందిన ఆస్తి - అది ప్రజా హృదయాల్లో వాటుకుపోయి వారి అభ్యుదయానికి మార్గదర్శకం కావాలి" — లెనిన్

# గురుఅర్జున్

శిక్కు శిష్య పరంపరలో ముఖ్యుడు అర్జున్ దేవ్. అతి శ్రద్ధాభక్తులతో గురువుగారిదగ్గర శుశ్రూష చేస్తూ ఉండేవాడు. తోటి శిష్యులందరూ గురువుదగ్గర చేరి తత్త్వవిషయా



గురు అర్జున్

లను వితర్కిస్తూ ఉంటే అర్జున్‌దేవ్ వంటశాలలో ఇత్తడి బిందెలు తోముతూ ఉండేవాడు. అతడికి ఆ పని అంటే ఎంతో ఆనందం, అభిమానం. రాత్రిపూట కూడా ఆ వంటశాలలోనే పాత్రలు శుభ్రంచేస్తూ ఉండేవాడు.

గురువుగారికి మరణ సమయం ఆసన్నమైంది. గొప్ప గొప్ప శిష్యులందరూ వారి చుట్టూ చేరి గురువుగారి చరమ ఆశీస్సులను పొందాలని తహతహలాడుతున్నారు. అర్జునదేవ్ యథాప్రకారం వంటశాలలోనే తన పనిలో ఉన్నాడు. గురువుగారు అర్జున్ దేవ్‌ను పిలిపించారు. అర్జున్‌దేవ్ ఎక్కడి పాత్రలు అక్కడే వదలి మసిగుడ్డలతో, మసి చేతులతో పరుగెత్తి వచ్చాడు. శిష్యులందరూ మసి అంటుకుంటుందని వెనుకకు జరిగారు. గురువుగారికి అర్జున్‌దేవ్‌ని చూచినవెంటనే అమిత ఆనందం కలిగింది. తన తరువాత అర్జున్‌దేవ్ తన వారసుడని, తన పదవిని అలంకరిస్తాడని అక్కడ చేరినవారందరితో చెప్పారు.

దురహంకారులైన శిష్యులకు, మహాత్ములకు విస్మయం కలిగింది. గురువుగారు పొరపాటు పడ్డారేమో అనుకొని "మాకులేని గొప్పతనం ఇతడికేమి సిద్ధించింది?" అని అడిగారు. "ఇతడు నేర్చుకున్న దేమీ లేదు. అదే అతని సిద్ధి. ఇతడు కపటం లేనివాడు" అన్నాడు గురువు.

ఈ విధంగా ప్రతిరోజూ వంటపాత్రలను తోమే అర్జున్‌దేవ్ 5 వ శిక్కు గురువుగా చేయబడ్డాడు. ఇతడే 'గురుగ్రంథ్ సాహెబ్'ను సంకలనం చేశాడు. శిక్కు మతంలో ఆత్మ తత్త్వాన్ని ప్రతిపాదించాడు.

---

"నాటక కళాభ్యుదయంపైనే ఒక జాతి సంస్కృతియొక్క ఔన్నత్యం నిర్ణయించబడం జరుగుతుంది." —రవీంద్రనాథ్ ఠాగూర్

# తుమ్ము అపశకునం

ఈనాడు 'ఆచ్' అని ఎవరైనా తుమ్మితే మనం అంతగా పట్టించుకోము. జలుబు తీవ్రంగా ఉంటే ఆఫీసుకు నాలుగురోజులు సెలవు పెట్టవలసి వస్తుంది. ఏదైనా పార్టీకి వెళ్ళడం పడదు.



పూర్వం తుమ్మడం అంటే ఒక పెద్ద అపశకునంగా పరిగణించేవారు. తుమ్మితే ఎన్నో ముందుజాగ్రత్తలు తీసుకునేవారు. ఈనాటికీ కూడా గ్రామాలలోను, ప్రాచీన సాంప్రదాయకపు కుటుంబాలలోను ఎవరైనా తుమ్మితే సరి 'చిరంజీవ', 'శతాయుష్మ' 'దేవుడు రక్షించుగాక!' అని. అన్నం తింటూ తుమ్మితే ముఖం మీద నీళ్ళుజల్లి 'ఏ ఊళ్ళో పుట్టావు!' అని అడుగుతూంటారు. ఈ ఆచారం మధ్య యుగంలో ప్రారంభమైంది. అప్పుడప్పుడు యూరపులో ప్రజలను పట్టి పీడించేది ఈ రోగం.

అనాదినుంచీ కూడా పలుచోట్ల అనేక జాతులలో తుమ్మని గురించి వివిధ నమ్మకాలు ఉండేవి. ప్రాచీన గ్రీకులు. రోమనులు కూడా వీటిని గురించి గ్రంథాలలో ప్రస్తావించారు. అమెరికన్ ఇండియన్‌లు తుమ్ము అంటే చాలా చీదరించుకుని, అసహ్యించుకునే వారని, తుమ్ము తుమ్మితే దానివల్ల కలిగే చెడును పోగొట్టుకోడానికి అనేక కర్మకాండలు ఆచరించే వారని అమెరికాను కనుగొన్న కొలంబస్ తన ప్రయాణంలో తెలుసుకున్నాడు. 19వ శతాబ్దంలో ఆఫ్రికా ఆటవికులలో ఈ వింత ఆచారం ఉందని ఒక యాత్రికుడు తెలియజేశాడు. ఇతడు ఏనుగు దంతం కొనుక్కుందామని ఈ కొండ జాతులతో వ్యాపారం చేస్తూ ఉండగా అకస్మాత్తుగా తుమ్మాడు. వెంటనే ఈటెలతో, బాణాలతో, ఆయుధాలతో కొండజాతులు ఇతడి చుట్టూ మూగారు. ఒక పెద్ద మంట పెట్టారు భూతవైద్యుడు ఇతడి తలమీద కొవ్వు బాగా పట్టించాడు. తుమ్ముల దయ్యాన్ని వెడలగొడతామని మూడురోజులు చాలా తీవ్రమైన చికిత్స నడిపించారు తమ నాయకుడితో మాట్లాడనివ్వలేదు. దయ్యం వదిలేదాకా అసలు నాయకుణ్ణి చూడనివ్వలేదు. అప్పటినుంచీ ఆటవిక జాతులలో ఉన్నప్పుడు తుమ్ము రాకుండా ఎంతో జాగ్రత్తపడ్డాడు! ●

"సౌహార్దం, దయ, ఉత్సాహం, ఓర్పు అనే నాలుగు సద్గుణాలు కలిగినవాడే నిజమైన శిక్కు" —గురునానక్

# మీకు తెలుసా ?

ప్రపంచంలో అతి సుందరమైన నగరం:

పారిస్. ఫ్రాన్స్ రాజధాని ప్రపంచంలోనే అత్యంత సుందరమైన నగరం.

• • •

మానవుడికి తెలిసిన మొట్టమొదటి లోహం

మానవ మాత్రులకు మొట్టమొదట తెలిసిన లోహం రాగి.

• • •

అపోలో 11 అంతరిక్ష నౌకకు 150 లక్షల విడిభాగాలు:

చంద్రలోకంలోకి మానవులను చేరవేసిన అమెరికా అంతరిక్ష నౌక అపోలో 11 కి 150 లక్షల విడిభాగా లున్నాయి.

• • •

(37 వ పేజీ తరువాయి)

సింహం చాలావరకు సాధువుగా కనిపించినా కోపం వచ్చినప్పుడు. పిల్లలదగ్గిర ఉన్నప్పుడు, ఆకలి వేసినప్పుడూ క్రూరంగా మీద పడి చంపుతుంది.

మగసింహాలన్నిటికీ మెడమీద పెద్దజూలు ఉంటుంది. ఆసియా సింహాలకు జూలు పొట్టిగామా, ఒత్తుగాను ఉంటుంది మట్టి కొంచెం పొడవుగా ఉంటుంది. భుజాలమీద, తోకకూ వెంట్రుకలు విస్తారంగా ఉంటాయి.

ప్రపంచంలో అతి వేగమైన ఆట:

ఐస్ హాకీ ప్రపంచంలో అతివేగమైనఆట.

• • •

ప్రపంచంలో పెద్ద హాస్పిటలు:

అమెరికా న్యూయార్క్‌లో దబ్ల్యు. బ్రెంట్ వుడ్‌లోగల పిల్‌గ్రిమ్ స్టేట్ హాస్పిటలు ప్రపంచంలోనే మిక్కిలి పెద్దది.

## భారతదేశపు ప్రప్రథమ మెట్రో రైల్వే



దక్షిణ కలకత్తాలో మొత్తం 16 కి.మీల కలకత్తా మెట్రో రైల్వేలో సెంట్రల్ కలకత్తా ఎస్‌ప్లెనేడ్ నుండి భవానీపూర్ వరకు ఈ మధ్య ప్రారంభించిన 6 కి మీల దూరం భారతదేశపు మొట్టమొదటి మెట్రో రైల్వే. మొత్తం 16 కి. మీ. మార్గం 1988 నాటికి పూర్తి అవుతుంది.

"పరివర్తనం లేకుండా ప్రగతి అసంభవం." -ఫ్రాంక్ జప్పా

# క్రమబద్ధం

డా. క్లైవ్. డి. హర్లీ

ఒక రోజుకి 24 గంటలకాలం. అందరికీ ఇంతే. అయితే కొంతమంది మాత్రం ఈ కాలంలోనే అధికంగా పనిచేస్తారు. నిర్విరామంగా కార్యక్రమాలన్నీ చక్కబెట్టుకుంటారు. ఏమిటి వీళ్ళ రహస్యం?



హడావిడిగా ఉండేవాళ్ళు ఎప్పుడు ఏదో పనిచేస్తూ ఉన్నట్టే ఉంటారు. అటువంటి వాళ్ళు ఊరికే కూర్చోలేరు తీరికగా ఆలోచించడానికే వాళ్ళకి టైము ఉండదు. ఒక అపూర్వప్రోత్సాహక ఉద్వేగం, ప్రేరణశక్తి సదా వారిలో ప్రవర్తిస్తూ ఉంటుంది. వాళ్ళకి ఇక శాంతి లేదా అనిపిస్తుంది. మరో రకం మనుష్యులు ఉంటారు. వీళ్ళకి ఎక్కడలేని శక్తి అమోఘంగా ఉంటుంది. ఎప్పుడూ చైతన్యవంతంగా, ఉత్సాహంగా కనిపిస్తారు. నిరుత్సాహం లేకుండా వుంటే మన అందరికీ కూడా శక్తి అధికంగానే ఉంటుంది. కోపావేశాలు, నిరాశలు, ఈర్ష్య. అసూయా ద్వేషాలు ఉంటే ఎంతో అమూల్యమైన శక్తి తగ్గిపోతుంది.

మానసిక చైతన్య శక్తిని ఉచ్ఛస్థాయిలో ఉంచుకోడానికి విశ్రాంతి, వినోదం కూడా అవసరం. దీనివల్ల ఎన్నెన్నో పనులు సార్థకంగా నెరవేర్చుకోవచ్చు. బద్ధకాన్ని పోగొట్టుకుని వృథా కాలయాపన చేయకుండా ఎప్పుడూ ఏదో వ్యాసంగంతో పనిచేస్తూ ఉండాలంటే—

1. పొందిక అవసరం: చాలా పనులు చక్కబెట్టుకోవాలంటే అనవసరంగా చాలా సేపు ఒకే పనిమీద కాలయాపన చేయకూడదు. టీ వీ. వల్ల చాలా సమయం వృథా అయిపోతుంది. మనోనిగ్రహంతో ముఖ్య

## విడాకుల వింత

ఆఫ్రికా బాబిరా జాతిలో ఒక వ్యక్తి భార్యకు విడాకులు ఇవ్వదలచుకుంటే రాత్రి ఇంటి గుమ్మం ముందు ఒక ముంత నూనె, ఒక చేతికర్ర పెడతాడు. పొద్దున భార్య ఇది చూచినప్పటినుంచీ వారి వివాహం విచ్ఛిన్నమైందని అర్థం చేసుకుంటుంది.

"దోషాలు వెదికే వారికి స్వర్గంలోనూ దోషాలు కనిపిస్తాయి." —థోరో

మైన ప్రోగ్రాములే చూడడానికి అలవాటు చేసుకోవాలి అప్పుడు అధిక కాలం వృధా కాదు. ఆటగాళ్లు, వార్తల కోసం వార్తా పత్రికలు చదివేవాళ్ళు, నవలలు వదల కుండా చదివేవాళ్ళు కూడా ఇదే సూత్రాన్ని అవలంబించాలి. ఆటలుగానీ, వార్తాపత్రికలు గానీ, నవలలుగానీ మన విజ్ఞానాభివృద్ధికి సహకరించాలిగానీ వాటికి మనం లొంగిపో కూడదు.

2. వృథా కాలయాపన చేయకూడదు: ప్రతి రోజూ మన కాలం ఎలా ఎక్కడ వ్యయం అయిపోతూందో పరిశీలించుకోవాలి. ఒక పనికీ, మరో పనికీ మధ్య ఎంతకాలం వ్యర్థం అవుతుందో గ్రహించాలి. కొంతమంది ఒక పని చేసేటప్పుడు ఊరికే అటూ ఇటూ తిరగడంతోనే ఎంతోకాలం వృథా చేసుకుంటారు. ఒక పనిలో ఒక పావుగంట కలిసివస్తే రోజుకు రెండుగంటల కాలం ఆదా అవుతుంది. ఈ ఆదా చేసుకున్న కాలంలో మరో ముఖ్యమైన పని చేసుకోవచ్చు మనో నిశ్చయం లేకుండా కాలం వ్యయం చేసుకునేవాళ్లు కొంతమంది ఉన్నారు. వీళ్ళు ప్రతిపనికి ఏదో తటపటాయిస్తూంటారు. తెగతెంపులుగా నిశ్చయం చేసుకోడం అలవాటు చేసుకోవాలి.

ఈ ఉదయం ఏం తిందాం? ఈవేళ ఎక్కడికి వెళదాం? అనే విషయాల మీద ఎక్కువకాలం వ్యయం చేయకూడదు. ఈ విధంగాచేస్తే ముఖ్యమైన వాటిని గురించి ఆలోచించుకుని పనులు నెరవేర్చుకోడానికి కాలం కనిపించదు. వృథా కాలయాపనకి మరో కారణం అనవసరమైన సంభాషణలు. దీని వల్ల మీ టైమేకాదు ఎదుటివారి టైముకూడా వృథా అవుతుంది. కొంతమంది అవకాశం దొరికితే చాలు కనీసం అరగంటదాకా విరామం

## శౌర్యంతో ఉద్యమించే వీరులు కావాలి



కార్యసాధన నా లక్ష్యం. శౌర్యంతో పని చేసే వీరులు కావాలి అధర్మానికి లొంగిపోక న్యాయానికీ, ధర్మానికీ నిర్విరామంగా పోరాడే శూరులు కావాలి. మీరు పెద్ద పెద్ద కార్యాలు చేపట్టాలి. మీరు భారతదేశపు పురోభివృద్ధి కంటే ఇంకొకటి ఊహించగలరా?

—జవహర్‌లాల్ నెహ్రూ

"తృప్తిచెందని మనుజుడు సప్త
ద్వీపములనయిన జక్కంబడునే."
-భాగవతం

లేకుండా మాట్లాడుతూంటారు.

3. యాంత్రిక పరికరాలు ఉపయోగించండి యంత్ర పరికరాలు, కాలుక్యులేటర్లు, టెలిఫోను, బస్సు, టేపు రికార్డరు, టైపురైటరు, రెఫ్రిజిరేటరు, గాస్ స్టౌవులు మొదలైనవాటి ఉపయోగంవల్ల మనకు ఎంతో కాలం కలిసివస్తుంది; అనుకూలం కూడాను.

వేగంగా చదువుకోడం అలవాటు చేసుకోవాలి. పుస్తకమో, పేపరో పెట్టుకుని ప్రతి లైను ఈ చివరినుంచి ఆ చివరిదాకా ప్రతీ మాటా కూడబలుక్కొని చదవడం మనం అభ్యాసం చేసుకున్నాం ఈ అభ్యాసం పోగొట్టుకోవాలి. వాక్యాలు తొందరగా చూచి అర్థం చేసుకోవడం నేర్చుకోవాలి. వాక్యంలో ముఖ్యమైన విషయం ఎక్కడ ఉందో వెంటనే గ్రహించాలి దీనివల్ల ఎంతోకాలం, శ్రమ కూడా కలిసివస్తాయి. ఇలా అభ్యాసం చేసుకోడానికి కొంతకాలం పడుతుంది.

4. కాలం క్రమబద్ధం చేసుకోవాలి: దీనివల్ల మీ నైతిక విలువలు పెరుగుతాయి. పనులు సక్రమంగా నెరవేర్చుకోడానికి అవకాశాలు ఏర్పడతాయి. కార్యక్రమం నియమావళి తయారుచేసుకోవాలి. ఈ నియమావళి ప్రకారం పనులు కొనసాగించుకోవాలి. వీలుగాఉంటే ప్రత్యేకంగా మీ పనులు చేసుకోడానికి వేరే గది ఉంచుకోండి. బల్ల, అల్మైరా, దస్కు అన్నీ సర్ది ఎక్కడ ఉండవలసిన వస్తువులు అక్కడ ఉంచుకోవాలి. దస్కుదైరీ అలవాటు చేసుకోడం ఉత్తమం. దీనివల్లకూడా ఎంతోకాలం కలసివసుంది.

'ఇప్పటిది ఇప్పుడే చెయ్యి' అనే సూక్తిని పాటించాలి. 'అలక్ష్యం అమృతం విషం' అన్నారు. నియమంతో, నిష్ఠతో కాలాన్ని క్రమబద్ధం చేసుకుంటే ఎంతైనా ఎన్ని పనులైనా జయప్రదంగా సాగించవచ్చు. ●

## విరిగిన పంటికి 90,000 డాలర్ల పరిహారం



Lollobrigida

57 సంవత్సరాల వయస్సుగల ప్రఖ్యాత సినీ నటి గిన్నాలొల్లోబ్రిగిడా ఇప్పుడు ఫాషన్ ఫొటోగ్రాఫర్. అమెరికా న్యూయార్కు కోర్టు ఈ మధ్య ఈమెకి 90,000 డాలర్లు పరిహారం ఇప్పించారు. నాలుగు సంవత్సరాలకు పూర్వం ఒక హోటల్‌లో ఫలహారంచేస్తూ ఉండగా అందులో రాతి బెడ్డవల్ల పన్ను విరిగిపోయింది. దాంతో కేసు పెట్టుకుంటే జడ్జి హోటల్ యాజమానుల నిర్లక్ష్యానికి ఈమెకు 90,000 డాలర్ల పరిహారం ఇప్పించారు.

"పద్మగంధుల్ మరిగిన లేటు లన్య కుసుమంబుల జేరనేర్చునే." —భాగవతం

# [illegible]రు సతీమణులు

టి. నీలకంఠన్

## 1

ఒక మహాపురుషుని భార్యగా ఉండడం అపూర్వమైన సదవకాశమే కాదు. కత్తిమీది సాము వంటిది కూడా. భర్త మనోభావాలను పూర్తిగా అవగాహన చేసుకుని వాటికి అను గుణంగా ప్రవర్తించాలి. మహా భక్తుడైన



కస్తూరిబా గాంధీ

తుకారాం ఆధ్యాత్మిక వ్యామోహంతో ప్రపం చాన్నే మరచిపోయేవాడు. అతడి భార్య జిజాయి అనేక కష్టాలను, ఇబ్బందులను అనుభవించినా పతిభక్తితో భర్తకు సేవ చేసింది. అశోక చక్రవర్తి భార్య దేవి. ఆమె సలహా ననుసరించే అశోకుడు ఈనాడు కూడా బౌద్ధులకు యాత్రా కేంద్రాలైన సాంచీ స్థూపాలను నిర్మించాడు.

గొప్ప కవి, నోబెల్ బహుమతి గ్రహీత



కమలా నెహ్రూ

రవీంద్రనాథ్ టాగూర్ శాంతినికేతన్ విద్యా సంస్థను అభివృద్ధిచేయడానికి పూనుకున్నాడు. అతడి భార్య మృణాళినిదేవి భర్తకు చేదోడు వాదోడుగా ఉండి శాంతినికేతన్ నడిపించ డానికి ఆమె ఆభరణాలను సహితం అర్పిం

---

"హఠాత్తుగా ఏర్పడే దురదృష్టాల నుండి రక్షించుకోడానికి మనోధైర్యాన్ని అభివృద్ధిపరచుకో."

చించింది. కస్తూరిబాగాంధీ గాంధీమహాత్ముని ఆదర్శ సతీమణి. పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ భార్య కమలానెహ్రూ ఆయనకు రాజకీయరంగంలో ఎంతో సహాయం చేసింది. నోబెల్ బహుమానాన్ని స్వీకరించిన సర్ సి.వి. రామన్ మరణించినప్పుడు ఆయన సతీమణి లోకసుందరి "ఆయన సేవకోసమే నేను ఈ లోకంలో జన్మించాను. నా జన్మ తరించింది" అని అంది. సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీకి అధ్యక్ష పదవిని



సి.వి. రామన్

స్వీకరించి సిల్వర్ టంగ్‌డ్ ఆరేటర్ అనే బిరుదు గడించిన రైట్ ఆనరబుల్ వి.ఎస్. శ్రీనివాస శాస్త్రి సతీమణి లక్ష్మి. తను మహా పుణ్యం చేసుకున్నందుకు ఆమె తనకు భార్యగా లభించిందని ఆయన చెప్పేవారు.

సుప్రసిద్ధ ఖగోళ భౌతిక శాస్త్రజ్ఞుడు డా. ఎస్. చంద్రశేఖర్‌కు అనుకూలవతి అయిన భార్య లలిత. చైనా మరియు ఇతర దేశాలలో



డా. చంద్రశేఖర్

భారత రాజ్యాంగ దూతగా ఉన్న కె.ఎస్. బాజ్‌పాయ్ భార్య మీరా స్వదేశంలోనూ, ఇతర దేశాలలోనూ అపార సేవ చేసింది. నోబెల్ బహుమాన గ్రహీత జార్జి బెర్నార్డ్‌షా

## 7,000 సంవత్సరాలనాటి మానవుని మెదడు

అమెరికా భూగర్భ శాస్త్రజ్ఞులు ఫ్లోరిడా (అమెరికా) లో కెనడా స్పేస్ సెంటర్ దగ్గర శ్మశాన వాటికలో భద్రపరచబడిన 7,000 సంవత్సరాల నాటి మానవుల మెదడులను రెంటిని కనుగొన్నారు. ఇవి మిక్కిలి భద్రంగా సంపూర్ణంగా ఉన్నాయి.

"పైత్య దోషోదయంబున బరువనైన
జిహ్వకకు పంచదారయు చేదుకాదె." —వేమ

పోయినా అంతకంటే ముఖ్యమైన తన భర్తను పూర్తిగా తెలుసుకోగలిగానని చెప్పింది. సుప్రసిద్ధ గణిత శాస్త్రజ్ఞుడు ఎస్ రామానుజం భార్య జానకి రామానుజం తన భర్త ప్రతిపాదనలు తెలియక పోయినా తన భర్తను పూర్తిగా తెలుసుకుని సేవ చేయగలిగినందుకు సంతోషపడింది.

అమెరికా కోటీశ్వరుడైన జాన్ డి. రాక్ ఫెల్లర్ స్త్రీల అభ్యున్నతికి 1902 వ సం. లో జనరల్ ఎడ్యుకేషన్ నిధిని ఏర్పరచాడు. ఈ ఉద్యమంలో ఇతడి భార్య లారా స్పెల్‌మన్ రాక్ ఫెల్లర్‌కు ఎంతో సహాయం చేసి స్త్రీల సంక్షేమానికి తానే స్వయంగా సేవచేయడానికి ఎంతో కుతూహల పడింది.



మార్గరెట్ థాచర్

బ్రిటన్ ప్రధానమంత్రి మార్గరెట్ థాచర్ ప్రభుత్వ కార్యక్రమాలలో పాల్గొంటూ క్షణం తీరిక లే పోయినా స్వయంగా భర్తకు వండి పెట్టడం తన ముఖ్యధర్మంగా పరిగణించింది. సుప్రసిద్ధ సినీనటి మిస్ నాన్సీ సినీరంగంలో పేరు ప్రతిష్ఠలు పొందింది. ఈమె రొనాల్డ్ రీగన్‌ను వివాహమాడి, భర్తకు సేవచేయడానికి, తన సినిమా వ్యాసంగానికి పొత్తుకుదరదని సినీరంగంలో నుంచి విరమించుకుంది. అమెరికా ప్రథమ మహిళగా వ్యవహరింపబడే నాన్సీ శ్రద్ధాభక్తులతో పతికి సేవలు చేస్తూంది.

(సశేషం)

## భావపరిచయ పోటీ

(మే 1986)

"స్థితులు వేరైనా ధ్యేయం ఒక్కటే
క్రమశిక్షణ లోపిస్తే సర్వం శూన్యం"

—యూస్ఫీరామ్, పలాస,
(శ్రీకాకుళం జిల్లా)

* * *

"విద్యకు ఆసక్తి ముఖ్యం -
అది లేనినాడు
ఎన్ని సౌకర్యాలు ఉన్నా వ్యర్థం"

—లంక ఫణీందర్,
తుంగభద్రా డామ్. కర్ణాటక.

* * *

"కృత్రిమ గోడల నడుమ చదువుకన్నా
ప్రకృతి నీడల నడుమ చదువు మిన్న"

— బత్తుల గోవిందరావు,
మఠం సరియా పల్లి, (శ్రీకాకుళం జిల్లా)

"సంతులిత మైన శక్తి పొంగి పొరలితే
మానవజాతి జీవనం మారుతుంది" —ఆల్విన్ టాఫ్లర్

(16 వ పేజీ తరువాయి)

లను సంరక్షించి తిరిగి యుద్ధానికి లేవదీసాడు.

ఇంగ్లండుకు మరలి రావడంతోనే జనరల్ అలెగ్జాండరు సదరన్ కమాండ్ అధికారిగా నియమింపబడ్డాడు. ఇతడు వెంటనే సైన్యాన్ని కూర్చుకుని జర్మన్‌దాడిని ఎదుర్కోడానికి నిర్ణయించుకున్నాడు. జపాను సైనికులు ఆక్రమించుకున్న బర్మాకు బ్రిటిష సైన్యాధిపతిగా 1942 వ సంవత్సరంలో పంపబడ్డాడు. 24 గంటలలో మార్చి 10, 1942 లో బర్మా చేరుకున్నారు. రంగూను జపాను వశమయింది. జపాను సైన్యం మీదికి దాడిచేసి 80 శాతం తన సైన్యాన్ని రక్షించుకో కలిగాడు

"పోరాడు, పోరాడు ఎదిరించినా సరే పోరాడు" అనేదే హెరాల్డ్ యుద్ధగీతిక. మిడిల్ ఈస్ట్‌లో కమాండరన్ చీఫ్‌గా నియమింపబడిన తరువాత ఈజిప్ట్, లిబియాలలో అలెగ్జాండరు దిగ్విజయాలు సాధించాడు.

1943 ఫిబ్రవరిలో అలెగ్జాండరు ఉత్తర ఆఫ్రికా ఆంగ్లో-అమెరికన్ సైన్యాధికారిగా (ఫీల్డ్ కమాండర్) నియమింపబడ్డాడు. జనరల్ డ్వైట్ డి. ఐసన్‌హోవర్ క్రింద ఇతడు అతి చాకచక్యంగా ట్యూనీషియాలో జర్మన్ ఇటాలియన్ సైన్యాన్ని ఓడించ గలిగాడు. ఆంగ్లో అమెరికన్ 15 వ ఆర్మీ గ్రూప్ కమాండింగ్ జనరల్‌గా అలెగ్జాండరు ఇటలీకి దక్షిణంగా సిసిలీదీవుల విముక్తిని సాధించాడు.

సెప్టెంబరు 3, 1943 న ఇటలీ ముట్టడి

## టొమాటో సకల రోగాలకు సంజీవిని



ఆహారంలో టొమాటో మానవునికి చేసే మేలు అంతా ఇంతా కాదు. చర్మం అభివృద్ధి పొంది నిగనిగలాడుతూ ఉంటుంది. రక్తం శుభ్రపడి కాలేయం సక్రమంగా పనిచేస్తుంది. మూత్రకోశంలో రాళ్ళు కరిగిపోతాయి. ఊబగా పెరిగిపోయిన శరీరాన్ని సన్నపరుస్తుంది. కడుపులో చేరిన గాలిని హరిస్తుంది. కీళ్ళవాతం, కీళ్ళ నొప్పులు తగ్గుతాయి. రక్తపుపోటును తగ్గిస్తుంది. క్షయవ్యాధికి దివ్యఔషధంగా పనిచేస్తుంది. సైనస్ బాధను తగ్గిస్తుంది టొమాటోలో లభించే ఏకోటినిక్ ఆసిడ్ రక్తంలో కొలెస్టరాల్‌ను తగ్గించుతుంది. దీంట్లో ఉండే విటమిను 'K' రక్తస్రావాన్ని అరికడుతుంది.

"అందని ద్రామల పండ్లు కోయదలచుట
సాధ్యముకాని పనిని చేయబూనుట."

అలెగ్జాండరు యొక్కని మరో ఘనకార్యం. హిట్లరు రష్యాలోను, పడమటి యూరప్ లోను సైన్యాన్ని విజృంభించకుండా చేయటమే ఇతని ముఖ్య కర్తవ్యం. ఈ పనిని కొనసాగించడానికి, ఇటలీలో ఆంగ్లో అమెరికన్ దళాలకు, ఇతర అలీన సైన్యాలకు 1943 డిసెంబరులో కమాండరుగా నియమింపబడ్డ అలెగ్జాండరుకు కొద్ది సైన్యాన్ని మాత్రమే ముట్టజెప్పారు.

అయినప్పటికి ధైర్య సాహసాలతో ఇటలీ మంచు లెక్కచేయక లోపలికి ప్రవేశించి చొచ్చుకుపోయి జూన్ 4, 1944 న ఇటలీ ముఖ్యపట్టణమైన రోమును స్వాధీనం చేసుకున్నారు. అలెగ్జాండరు ఎంతమాత్రం యోచన లేకుండా మౌంట్ కాసినో మీద బాంబులు వేసినా, అన్జియోలో ఏమి లాభం లేకుండా దిగినా, మొత్తంమీద తనకున్న కొద్దిపాటి సైన్యంతో అతడు అనేక అద్భుత కార్యాలు సాధించగలిగాడు. ఏప్రిల్ 28, 1945 లో మొదటిసారి జర్మన్ సైన్యం చీలిపోయింది ఆరోజున 10.00.000 మంది జర్మన్ సైనికులు అతడికి లోబడిపోయారు.

1944 లో అలెగ్జాండరు ఫీల్డ్ మార్షల్‌గా నియమింపబడ్డాడు విస్కౌంట్ అలెగ్జాండర్ ఆఫ్ ట్యూనిస్ అనే బిరుదును పుచ్చుకున్నాడు. యుద్ధకాలమంతా అలెగ్జాండరు తన కుమార్తెలకు పెద్ద పెద్ద ఉత్తరాలను వ్రాస్తూ ఉండేవాడు ఉత్తరాలలో తాను చూచిన వింత ప్రదేశాలను, జంతువులను కూడా చిత్రిస్తూ ఉండేవాడు.

1946 లో అలెగ్జాండరు కెనడాకు గవర్నర్ జనరల్‌గా నియమింపబడ్డాడు. ఈ పదవిలో 6 సంవత్సరాలపాటు ఉన్నా, తరువాత ప్రధాన మంత్రి విన్‌స్టన్ చర్చిల్ క్రొత్త మంత్రి వర్గంలో డిఫెన్స్‌మంత్రిగా నియమింపబడ్డాడు. అలెగ్జాండరు జూన్ 16, 1969 లో మరణించారు.

## రికార్డైన రఫీ పాటలు 28,000!



భారతదేశపు సుప్రసిద్ధ నేపథ్యగాయకుడు మహమ్మద్ రఫీ 1944 వ సం. నుండి ఏప్రిల్ 1980 వరకు 11 భాషలలో పాడిన పాటలు 28,000. వీరు జూలై 1980 లో మరణించారు.

"చేసిన పాపాలు పోగొట్టుకోలేక పోయినా క్షమింప జేసుకోగలం."

-స్ట్రావిన్‌స్కీ

# బహుమతి పొందిన వ్యాసం

# జాతీయసమైక్యత-యువకులబాధ్యతలు

పెంట సీతారత్నం, శ్రీకాకుళం.

ప్రజలు ఏ జాతికి, కులానికి, మతానికి, ప్రాంతానికి చెందినా అందరూ ఒక తల్లిబిడ్డల మనే భావాన్ని అలవరచుకోవడమే జాతీయ సమైక్యత. భిన్నత్వంలో ఏకత్వం జాతీయ సమైక్యతకు ప్రధాన లక్షణం.

ప్రాచీనకాలం నుంచీ భారతదేశంలో వివిధ కులాల మధ్య అంతర్వివాహాలు,పంక్తి భోజనాలు జరుగుతూ ఉండేవి. ఉత్తరభారత దేశానికి బదరీనాథ్, కాశీ ఎంత పవిత్ర మైనవో, దక్షిణ భారతదేశానికి మధురై, రామేశ్వరం అంత పవిత్రమైనవి. ఇతిహాసాలు, పురాణాలు, వేదాలు మొదలైన ప్రామాణిక గ్రంథాలన్నీ సంస్కృత భాష లోనే ఉండడంవల్ల ఆనాడు హిందువులందరికీ ఒకే భాష ఏర్పడింది. ఆంగ్లేయుల పరిపాలనా కాలంలో జాతీయ సమైక్యతాభావం ప్రజలలో ఉండడంవల్లనే స్వాతంత్ర్యం సంపాదించుకో గలిగాం.

ఈనాడు జాతీయ సమైక్యతాభావం ప్రజలలో కొరవడింది. కులమత తత్త్వాలు, భాషా విభేదాలు, ప్రాంతీయతా భావనల వలన ప్రజలు జాతీయ సమైక్యతకు దూరమవు తున్నారు.

---

## 40. లక్షల సం.ల నాటి కపాలం



పశ్చిమ ఇతియోపియా (ఆఫ్రికా) ఎడారులలో ఒక విజ్ఞాన శాస్త్రజ్ఞుల బృందం 40,00,000 సం.ల నాటి మానవుని కపాల అవశేషాలను కనుగొన్నారు. అన్ని విధాల మానవునిపోలి, తోకలేని కోతిలా ఉండే చింపాంజీ మెదడుకంటె చిన్న మెదడుకలిగి, ఆ మానవుడు రెండు కాళ్ళతో నడిచి ఉండవచ్చని నమ్ముతున్నారు.

---

"మూఢనమ్మకాలు అవివేకాన్ని కలిగిస్తే సంశయాలు పిచ్చిని పట్టిస్తాయి." —థామస్ ఫుల్లర్

జాతీయ సమైక్యతను సాధించవలసిన బాధ్యత యువతరం మీద ఎంతైనా ఉంది. మన సామాజిక వ్యవస్థ కుల ప్రాతిపదికపై ఉండడంవలన వివిధ కులాలమధ్య సామరస్యం లోపించింది; సంఘర్షణలు తల ఎత్తుతున్నాయి. వీనిని నశింపచేయడానికి కులాంతర వివాహాలు యువకులు పెంపొందించాలి. చైతన్యవంతమైన నూతన సమాజ నిర్మాణం చేయాలి. కొంతమంది దేశద్రోహులు స్వప్రయోజనాలకై ప్రజలలో కుల మత తత్త్వాలు ప్రోత్సహిస్తూ ఉంటారు.

యువకులు దేశంలో జాతీయ సమైక్యతా సంఘాలను ఏర్పరచుకోవాలి. ఈ సంఘాలలో వివిధ మతస్థులు, వివిధ కులాలవారు, వివిధ ప్రాంతాలవారు సభ్యులుగా ఉండేటట్లు చూడాలి. ఈ సంఘాలు జాతీయ సమైక్యతకు దోహదం చేసే కార్యక్రమాలు చేపట్టాలి. పాఠ్య ప్రణాళికలలో విశాలదృష్టినీ, మత సామరస్యాన్నీ, జాతీయ దృక్పథాన్నీ పెంపొందించాలి. విద్యాసంస్థలలో జాతీయ గీతం వినిపించడం, జాతీయ పతాకానికి వందనం చేయడం, జాతీయ నాయకుల జన్మదినోత్సవాలను జరపడం మొదలైన కార్యక్రమాలను చేపట్టాలి. ఈ విధంగా జాతీయ సమైక్యతా భావాన్ని వ్యాప్తి చేయాలి.

* * *

ఎమ్. లక్ష్మి, శ్రీకాళహస్తి.

ఒక దేశంలో పుట్టిపెరిగిన ప్రజలందరూ ఒకే మహత్తర ఆశయంతో కలసి ఉండుటను జాతీయ సమైక్యత అంటారు. ఆంగ్లేయుల పాలన జాతీయ సమైక్యతకు తోడ్పడింది.

కులతత్త్వం, మతతత్త్వం, భాషాతత్త్వం, ఆర్థిక అసమానతలు, రాజకీయ నాయకుల అధికార దాహం జాతీయసమైక్యత భంగానికి దోహదకారులు.

జాతీయ సమైక్యతను కాపాడవలసిన బాధ్యత ప్రభుత్వానిది. అయితే ఒక్క ప్రభుత్వమే ఈ పనిని చేయలేదు. ప్రజలు కూడా

## టాస్మానియా పులి ఇంకా ఉందా?



వరల్డ్ వైల్డ్ లైఫ్ ఫండ్ పరిశోధకులు కంగారు మృగంలా పొట్టకింద సంచివుండి రక్తాన్ని త్రాగే టాస్మానియా పులి అంతరించి పోయింది అని నిర్ణయించారు. అయితే దక్షిణ ఆస్ట్రేలియా దగ్గర చిన్న ద్వీపం-టాస్మానియా లోని వర్షపు అడవులలో ఇంకా యివి సంచరిస్తున్నాయని అక్కడి జనం అంటున్నారు.

"చీకటిలోకి దీపాన్ని తీసుకురావచ్చునుగానీ చీకటిని వెలుతురుగా మార్చలేరు."

సహాయ సహకారాలు అందివ్వాలి. బాల్య దశలో విద్యను అభ్యసించవలసి ఉంటుంది. కౌమారదశలో సంసార బాధ్యతలు వహించవలసి ఉంటుంది. వృద్ధులు నిస్సహాయులు. కాబట్టి ఐక్యతను కాపాడవలసిన గురుతర బాధ్యత చిత్తశుద్ధి, కార్యదీక్ష, సంకల్పబలం గల యువకులదే.

ఉత్సాహవంతులైన యువకులంతా గ్రామాలలోనూ, పట్టణాలలోనూ సంఘాలుగా ఏర్పడి, ప్రభుత్వం ఏర్పాటుచేసిన సమైక్యతా మండలితో సంబంధాలు పెట్టుకోవాలి. అనైక్యత అనర్థానికి దారితీస్తుంది అని లోగడ చేదు అనుభవాలను ప్రజలకు గుర్తు చేయాలి. మనది భారత జాతి. మనమంతా భారతీయులం అనే జాతీయభావం ఏర్పడేటట్టు చేయాలి. అస్పృశ్యతా భావాన్ని తొలగించాలి కులాంతర వివాహాలు ప్రోత్సహించి, ఆదర్శప్రాయులు కావాలి ఐకమత్యమే మహాబలం, కలపి ఉంటే కలదు సుఖం అనే వాక్యాలను సోదాహరణంగా వివరించాలి భిన్నత్వంలో ఏకత్వం ప్రదర్శించగల శక్తి భారతజాతికి ఉంది. కన్నతల్లి, మాతృభూమి స్వర్గంకన్న మిన్నయని వారికి తెలుసు

గుంటి వనకృష్ణ, శ్రీకాకుళం.

ప్రపంచంలో అన్ని విశ్వాసాలకు, అన్ని సత్యాలకు, హైందవ జాతీయ శ్రేయస్సుకు, విశ్వభావనకు దర్పణమై భాసిల్లుతున్నది హైందవ సాంప్రదాయక దృక్పథం. ఎన్నో మతాలలో, జాతులలో, సంస్కృతులలో హిందూదేశం భిన్నత్వంలో ఏకత్వమై విరాజిల్లుతూంది. ఈనాడు దేశంలో దౌర్జన్యశక్తులు విజృంభించి స్వాతంత్ర్యం సంపాదించిన ఆనందాన్ని నశింపజేస్తున్నాయి. దేశంలో హిందువులు, సిక్కులు మధ్య విభేదాలు కలుగుతున్నాయి.

నేడు మన భారతదేశంలో జాతీయ సమైక్యత సడలిపోయింది. యువకులు మాత్రమే జాతీయ సమైక్యతకు తోడ్పడగలరు. జాతీయ సమైక్యతకు బాధ్యత యువకులపై ఎంతైనా కలదు. ●

## క్రొత్త మాగ్నటిక్ హోవర్ ట్రెయిన్



కొత్త జర్మన్ మాగ్నటిక్ హోవర్ ట్రెయిన్ ట్రాన్స్‌రాపిడ్ 06 భారం 120 మెట్రిక్ టన్నులు. ఎటువంటి ఘర్షణ లేకుండా కాంక్రీటు భూమికి 16 మీటర్ల ఎత్తులో పోతుంది. ఈ రైలు ఎలక్ట్రో మాగ్నటిక్ శక్తితో పనిచేస్తుంది. గంటకు 400 కి. మీ. వేగంతో పోతుంది.

"విరగ గాసిన చెట్టుమీదికే జనం రాళ్ళు రువ్వుతారు." -ఫ్రెంచి సామెత

# తాలు

డా॥ కె. ఎస్. ప్రసాద్



[ఎర్త్ సైంటిస్టు, ఎన్విరాన్ మెంటలిస్టు అయిన డా. కె. ఎస్. ప్రసాద్ జియలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా మాజీ డైరక్టరు. వీరు పేలియో బయాలజీ, ఎన్విరాన్ మెంటల్ జియాలజీకి సంబంధించిన అనేక గ్రంథాలు ప్రచురించారు.]

అగ్నిపర్వతాలంటే కాస్తో కూస్తో మనందరికీ తెలుసు. అసలు వీటి స్వభావం ఏమిటి? అవి ఎలా ఏర్పడుతున్నాయి? వీటి వల్ల మానవులకు కలిగే నష్టం ఏమిటి? అనే విషయాల వివరాలు పూర్తిగా తెలియవు. భూగర్భంలోనుంచి శిలాద్రవం (లావా), వేడి బూడిద, ఆవిరి, ఇతర వాయువులు, దుమ్ము, ఇంకా అనేక ద్రవ పదార్థాలు భూమి లోపల ఏర్పడ్డ ఒత్తిడివల్ల మట్టి పొరలలో ఏర్పడిన రంధ్రంలో నుంచి పైకి తన్నుకువస్తాయి. ఈ మట్టి పొరలలో ఏర్పడిన రంధ్రమే అగ్ని పర్వతం (వాల్కెనో). అగ్ని పర్వతాల నుంచి వచ్చే పదార్థాలు సూచీ ఆకారపు కొండగా ఏర్పడుతాయి. పూర్వం ఎప్పుడో అగ్నిపర్వతాలు మండి విడుదలైన లావాలు చల్లబడటంవల్ల, గట్టిపడిపోయిన బూడిదవల్ల కొన్ని అగ్నిపర్వతాలు వాటంతట అవే ఏర్పడుతున్నాయి. ఈ అగ్ని పర్వతాలలోని లావా, బూడిద ఒకదానిపైన ఒకటి పొరలు పొరలుగా పేరుకుంటాయి. పెద్ద పెద్ద అగ్ని పర్వతాల చుట్టుపట్ల చిన్న చిన్న అగ్ని పర్వతాలు కొన్ని లేస్తూ ఉంటాయి.

అగ్నిపర్వతాలు పగిలి మండేటప్పుడు పైకి ఉబికివచ్చే లావాలవల్ల అనేక బీభత్సాలు

---

## రోమనుల సౌఖ్యమే నా

రోమ్ చక్రవర్తి మార్కస్ అరూలియస్ ఒక అధికారిని నియమించి చేతికి ఒక పట్టా కత్తినిచ్చి నేను నా ధర్మాన్ని అనుసరించే వరకు ఈ కత్తితో నన్ను రక్షించు. నేను నా ధర్మాన్ని అతిక్రమిస్తే నన్ను శిక్షించడానికి దీన్ని ఉపయోగించు. రోమనుల సౌఖ్యమే నా ధర్మం"—అని చెప్పాడు.

---

"గతించినవి. రానివి. రాబోయేవి ఎంత విలువైనవైనా
ఆందోళనా, యత్నమూ, వర్తమానానికి చెందినవే."

పంపిస్తాయి. కొన్ని సమయాలలో పర్వతమే పైకి ఎగిరిపోతుంది. నేపిల్స్ సముద్ర తీరంలో ఇటలీకి నైఋతిదిక్కుగా ఉన్న వెసూవియస్ (Vesuvius) అగ్నిపర్వతం ఇటువంటిదే యిరోపా ముఖ్య ప్రదేశంలో ఇదే ఇంకా సజీవంగా మండుతూ ఉండే అగ్నిపర్వతం. ఇది A D. 79 సం.లో



విజృంభించిన అగ్నిపర్వతాలు

పాంపేని పూర్తిగా ధ్వంసం చేసిన పెద్ద అగ్ని పర్వతానికి అవశేషాలు. హోన్షూ ద్వీపం మధ్య మిక్కిలి ఎత్తైన జపానుపర్వతం ఫ్యూజీ యామా (ఫ్యుజీ-సాన్) వెసూవియస్ లాంటి అగ్ని పర్వతమే. 1707 సం. లో మండి నప్పటి నుంచి ఇది నిద్రావస్థలో ఉంది.

దక్షిణ అమెరికాలో నార్త్ సెంట్రల్ ఈక్వడార్‌లో కోటోపాక్సి (cotopaxi) కూడా వెసూవియస్ వంటిదే. ఇదే ఈనాటికీ మిక్కిలి చైతన్యవంతంగా ఉంది, ప్రపంచం లోనే ఎత్తైన (5897 మీటర్లు) అగ్నిపర్వతం.

అగ్ని పర్వతాలు మూడు రకాలు. మిక్కిలి తరుచుగా లేస్తూవుండే ఏక్టివ్ అగ్ని పర్వతాలు (active volcanoes), దీర్ఘ కాలంనుంచీ నిద్రావస్థలో ఉండిపోయిన అగ్ని పర్వతాలు (dormant volcanoes), శిథిలమై నశించిపోయిన అగ్నిపర్వతాలు (extinct volcanoes). అగ్నిపర్వతాలు అకస్మాత్తుగా పగిలి మండవు. సాధారణంగా ఇవి మండే ముందు భూకంపాలు బయలు దేరుతూ ఉంటాయి అగ్ని పర్వతానికి చుట్టు పట్ల కొన్ని మైళ్ళదూరం వరకూ ప్రేలుడు శబ్దాలు వినిపిస్తాయి. ఆ తరువాత అగ్ని పర్వతాలలో నుంచి బయలుదేరిన శిలాద్రవం (లావాలు) వేడి, వాయువులు, బూడిద, దుమ్ము - పంటపొలాలను, నివాస స్థలాలను పూర్తిగా నాశనం చేస్తాయి.

కొన్ని అగ్ని పర్వతాలు శాంతంగా ఉంటాయి. హవాయిలో మౌనా లోవా (Mauna Loa) అగ్ని పర్వతాల నుంచి పైకి వచ్చిన లావా 80, 95 కి మీ. ప్రవహించి చల్లబడి మెల్లిగా గట్టిపడింది. ఇటలీకి నైఋతి దిక్కులో టిరనీనియన్ సముద్ర ద్వీపాలలో స్ట్రాంబోలీ అగ్నిపర్వతాలు చాలా విచిత్రమైనవి. వీటిలోనుంచి లావాలు రావు. ధగధగమండుతూ మాత్రమే ఉంటాయి.

జావా-సుమత్రాలకు మధ్య ఇండోనేషియన్ ద్వీపంలోని కారకటోవా అగ్ని పర్వతం 1883 సం. లో మండి మిక్కిలి నష్టం ఏర్పడింది. సుమారు 163 గ్రామాలు పూర్తిగా తుడిచివేయబడ్డాయి. ప్రవాహపు కెరటాల వల్ల 36,380 మంది

"నిజమైన స్నేహం నిర్వసొమ్ము వంటిది:
ఉపయోగించవంతకాలం దానికి మదుపు ఎక్కువే." —ఎల్‌బర్ట్ హబ్బర్డ్

జనం మరణించారు. 55 కి మీ పైకి ఆకాశం లోకి రాళ్లు విసరబడ్డాయి. ఇది మండిన 10 రోజులకు 5,330 కి. మీ. దూరంలో దుమ్ము పడింది. ఇది పగిలిన నాలుగు గంటలకు 4771 కి మీ దూరంలో ఉన్న రోడ్రిగ్స్ ద్వీపాలలో ప్రేలుడు శబ్దం రికార్డు అయింది. దీనివల్ల లేచిన దుమ్ము, లావాలు ఆకాశాన్ని కప్పి అనేక దేశాలకు సూర్యాస్తమయంలా కన్పించింది.

1902 నం. లో కరిబియన్ (caribbean) సముద్రంలో మార్టినిక్ ద్వీపాలలో సెంట్ పియర్రీ పట్టణం పూర్తిగా నాశనంచేసిన 'ఫియరీక్లౌడ్' (Fiery cloud) మౌంట్ పీలీ నుంచి బయలుదేరింది. దీని ప్రభావంవల్ల చీకటి చెరసాలలో ఉన్న ఒక ఖైదీ, ఒక చర్మకారుడు తప్ప ఆ పట్టణంలోని మొత్తం 28,000 మంది జనం ప్రాణాలు కోల్పో యారు. పై వారిద్దరికీ తీవ్రమైన గాయాలు తగిలాయి. మెడిటరేనియన్ మహా సముద్రం లోని ఇయోలియన్ ద్వీపాలలో విద్రావస్థలో ఉన్న అగ్నిపర్వతపు ద్వీపం వల్కెనో ద్వీపం నుండి 'వాల్కెనో' అనేమాట ఉద్భవించింది.

ప్రపంచంలో మిక్కిలి చైతన్యవంతంగా ఉన్న అగ్ని పర్వతాలు సుమారు 850. వీటిలో చాలావరకు సాగర గర్భంలో ఉన్నవే. జపాను, ఇండోనేషియా (ఆసియా), హవాయి (పసిఫిక్ మహాసముద్రం), ఇటలీ (దక్షిణయూరప్), దక్షిణ అమెరికా దేశా లలో గల ముడత పర్వతాలలో పెద్ద పెద్ద చైతన్యవంతమైన అగ్నిపర్వతాలు ఉన్నాయి. ప్రపంచంలోని చైతన్యవంతమైన అగ్ని పర్వ తాలలో 340 పసిఫిక్ మహాసముద్ర తీరపు ముడత పర్వతాలలోను, పసిఫిక్ సముద్రం ద్వీపాలలోను ఉన్నాయి. మిక్కిలి గంభీర మైన మౌనాలోవా (Mauna Loa) మరియు మౌనాకీ (Maunakea) అగ్ని పర్వతాలు సముద్ర మట్టానికి 4170 మీటర్లు పైకిలేచి అద్భుత దృశ్యాన్ని కల్పించాయి. ఇండో నేషియాలోని 167 అగ్నిపర్వతాలలో 77 మాత్రమే మండాయి.

భారతదేశంలో శిథిలమై నశించిన అగ్ని పర్వతమే (600 లక్షల సంవత్సరాల పూర్వం) దక్కన్ శిలాద్రవా ప్రవాహం. ఇదే దక్కన్ పీఠభూమి సుమారు 5,17,980 చ. కి. మీ. వైశాల్యంలో 1830 మీటర్ల దళసరిగా గట్టి పడ్డ లావా మహారాష్ట్ర, గుజరాత్, మధ్య ప్రదేశ్ మరియు కర్ణాటకలో కొన్ని ప్రదేశా లలోను చూడగలం. ఈ అగ్నిపర్వతం సూచీ ఆకారంలో ఉండదు. వాయవ్య అమెరికాలోని ఇదహో పీఠభూమి భారతదేశంలో ఉండే దక్కన్ పీఠభూమి వంటిదే! ●



"కవులు ప్రపంచంలో పేరులేని ప్రభుత్వంగా తిరుగులేని శాసనాధికారులు." — షెల్లీ

(8 వ పేజీ తరువాయి)

లను ఉత్పాదిస్తుంది ఈ గింజలను తిరిగి నాటి ఆ వచ్చే గింజలను మళ్ళా నాటుతూ



12 ఏళ్ళపాటు ఇలాగే చేసి తరువాత ఫల సాయాన్ని సంగ్రహిస్తే భూమిమీది జనాభాకి కొన్ని శతాబ్దాల వరకు చాలినంత పంట లభిస్తుంది. ఒక గోధుమ విత్తనం 244,140, 625,000,000,000,000 రెట్లు వృద్ధిపొందుతుంది.

అతి సామాన్యమైన అల్పసంఘటనల ఆధారంగా అనేక విజ్ఞానదాయకమైన అపూర్వ నూతన కల్పనలు ఏర్పడ్డాయి. ఒక పళ్ళెంలో తన్నుకుంటూన్న కప్పల కాళ్ళమీద ఒక కత్తిని ఉంచినప్పుడు అకస్మాత్తుగా చల విద్యుత్తు (Dynamic electricity) కనుగొనబడింది. మరుగుతూన్న వేడినీటి పాత్ర మీద పెట్టిన మూత ఆవిరికి ఎగురుతూ ఉంటే చూచి ఆవిరియంత్రం కనుగొనబడింది. త్రాడుమీద ఆరబెట్టినప్పుడు గాలితో నిండిన ఎగిరేచొక్కా బెలూనులు కనిపెట్టడానికి ఆధారమైంది. తోటలో ఒకమూల సాలీడు నిర్మించుకున్న గూడు సస్పెన్షన్ బ్రిడ్జికి ఆధారమైంది. ఒక పెద్ద చర్చిలో పైడోములో ఊగుతున్న లాంతరును చూచి లోలక సూత్రాలను తెలుసుకుని గడియారాలలో లోలకాలను (Pendulam) అమర్చారు. ఆపిల్ చెట్టునుంచి భూమిపై పడుతూన్న ఆపిల్ పండును గమనించి న్యూటన్ భూమ్యాకర్షక సూత్రాలను నిర్వచించాడు.

ఇద్దరు పిల్లలు ఆడుకుంటూ రెండు గాజు గ్లాసులు జోడించి చూస్తూ ఉన్నప్పుడు చర్చి టవరు ముందుకు వచ్చినట్టు గమనించి గెలీలియో టెలిస్కోపు కనిపెట్టాడు సాధారణంగా అందరికీ ఇటువంటివన్నీ అతి సామాన్యమైన అల్పవిషయాలేకాని ముందు చూపుతో, జిజ్ఞాసతో వీటిని పరిశీలించడంవల్ల మహాద్భుతమైన వైజ్ఞానిక విషయాలను శాస్త్రజ్ఞులు తెలుసుకోగలిగారు.

అత్యల్ప సంఘటనలవల్ల మహోపద్రవాలు కూడా ఏర్పడుతాయి. పెద్ద పెద్ద తుఫానులకూ, భూకంపాలకూ చెక్కు చెదరకుండా నిట్ట నిలువుగా పెరుగుతూ ఉన్న వృక్షం



"వ్యయ ప్రయాసల ఫలితమే సౌభాగ్యం." -జాన్ లాక్

వేరుపురుగు చేరి నిలువునా ఎండిపోతుంది. చిన్న చిన్న పిడుగు దెబ్బలకు మహావృక్షాలు కూలిపోతాయి. ఒక ఇంజనీరు లేక కండక్టరు



గెలీలియో

వాచిలో హెయిర్‌స్ప్రింగ్ తెగిపోతే ఒక్క నిముషం అటు ఇటులో పెద్ద పెద్ద రైలు ప్రమాదాలు సంభవిస్తాయి. వీపు మీద దెబ్బ కంటే కంట్లో చిన్న వెంట్రుక ఎక్కువ చికాకు కలిగిస్తుంది.

అతి పేలవంగా కనిపించే అల్ప విషయాలను పరిశీలించి తగు ముందు జాగ్రత్తలు తీసుకుంటే మిక్కిలి అధికలాభాలను పొంది సమాజంలో గౌరవ మర్యాదలను అనుభవించ గలం. ఇట్టి అల్పవిషయాలను సకాలంలో గమనించకపోతే అనేక కష్ట నష్టాలకు గురి అవుతాం. అవమానం పొందవలసి వస్తుంది.

తలనూనె సీసాకు మూత బిగించకుండా పెట్టడం, మందులపేర్ల చీటీలను అతికించ కుండా మందుసీసాలు ఉంచడం, ఇన్సూరెన్స్ ప్రీమియం సకాలంలో కట్టకపోవడం, లైసెన్స్‌లు, ఇతర బిల్లులు సక్రమంగా చెల్లించకపోవడం, గ్యాస్‌సిలిండరు, ఎలక్ట్రి సిటీ, టీ. వీ. ఆఫ్ చేయడం మరిచిపోవడం మొదలైనవి మన దైనందిన జీవితంలో అధిక కష్టాలను కలిగించే చిన్న చిన్న సంఘటనలు.

వివేకంతో, విజ్ఞానంతో ప్రగతికి ఉప యోగపడే అల్ప విషయాలను గూర్చి జాగ్రత్త పడడం మనకే మంచిది. అద్భుత సంఘట నలు నక్కృత్తుగా సంభవిస్తాయి. ఏ కొద్ది మందో వాటివల్ల లాభాన్ని పొందగలుగు తారు. అల్పమైన సామాన్య సంఘటనలు ప్రతి నిముషం అందరికీ జరుగుతూనే ఉంటాయి. ఇటువంటి ఒక సంఘటన జీవితంలో సుఖదుఃఖాలకు కారణం కాక పోవచ్చు. కాని అనేక సంఘటనల అంతిమ పర్యవసానం గమనార్హం అని దేనియల్ వెబ్‌స్టర్ విశదీకరించాడు. ఓర్పు కలిగి ఉంటే జీవితం ప్రకాశవంతంగా ఉంటుంది. దయా దాక్షిణ్యాలతో ఇతరులపట్ల ప్రవర్తిస్తే అతి దుర్భరమైన జీవితం కూడా ఎంతో ఆనం దంగా గడిచిపోతుంది. ●

## ఉత్తర ప్రదేశ్‌లో 778 సినిమాలు మాత్రమే

భారతీయ రాష్ట్రాలలో మిక్కిలి అధికంగా జనాభాగల ఉత్తర ప్రదేశ్‌లోని 1108 లక్షల జనానికి 778 సినిమాలు మాత్రమే ఉన్నాయి. ఈ లెక్కన 1,42,491 మందికి 2 సినిమాలు ఉంటాయి.

"వ్యాపారం మానె వంటిది, వ్యాపారం వ్యాపారంతోనే కలుస్తుంది. —శె. గ్రహం

# పోటీలు

జూలై 1985

'విస్డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొనవచ్చు. ఏ ఎంట్రీ కా ఎంట్రీ విడిగా పావు తావు సైజుకు తగ్గని కాగితం మీద వ్రాయాలి. ప్రతి ఎంట్రీ మీదా అడ్రస్సు ఉండాలి. ఒకే కాగితం మీద ఒకటి కంటె ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన, లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రు. 10 లు, రు. 7 లు, రు. 5 లు ఖరీదు చేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపన్' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకేసారి ఎన్ని ఎంట్రీ లయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరు తేదీ: జూలై 20, 1985. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు "విస్డమ్", 9. దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు - 600 004.

—సంపాదకుడు.

## వ్యాసం

'విశ్వశాంతి ఆవశ్యకత' అనే అంశం మీద 300 మాటలకు మించకుండా వ్యాసం వ్రాసి పంపండి.

## క్విజ్

1. కాండ్లరేవు ఏ రాష్ట్రంలో ఉంది?

స్నేహితుల విశ్వాసానికి లక్షణం చేతలే



రేఖ GEORGE WASHINGTON

మాటలుగాక చేతలే స్నేహానికి, పరస్పర అవగాహనకి లక్షణంగా గ్రహించాలి. ఇంత కంటే విశ్వాసమైనది మరొకటి లేదు.

—జార్జి వాషింగ్‌టన్

"మానవుడు ప్రకృతిని అనుసరించడానికి కాదు ప్రకృతిని జయించడానికే జన్మించాడు."

-స్వామీ వివేకానంద

3. నూతనము (సి), క్రోధింపబడినది, (డి). 4. మిక్కిలి వేగము (బి). బిగ్గరగా (సి) 5. శత్రువు (ఎ), కోయిల (బి), 6. భార్య (ఎ), శరీరము (బి), 7. కొప్పు (బి) 8. సంబంధము (సి), సమాప్తి (డి)

విజేతలు: మొదటి బహుమతి: వి. జగదీశ్, వరంగల్; రెండవ బహుమతి: బి. సురేశ్వరరాయ, హనుమకొండ, (వరంగల్ జిల్లా); మూడవ బహుమతి: పొన్నలూరి జానకిరాం. ఒంగోలు.

ముఖచిత్రవ్యాఖ్య: మొదటి బహుమతి: బి సోమశేఖర్, ఒంగోలు; రెండవ బహుమతి: పొన్నలూరి జానకిరామ్, ఒంగోలు; మూడవ బహుమతి ఎమ్ విజయలక్ష్మి, అప్పంపేట, (గుంటూరు జిల్లా).

పాఠకుల అభిప్రాయాలు: మొదటి బహుమతి: ఎల్ సత్యనారాయణ, వెంకంపేట, (విజయనగరం జిల్లా): రెండవ బహుమతి: ఎమ్. పంకజాక్షి. ఖరగ్‌పూర్. ప. బెంగాల్: మూడవబహుమతి: సురేంద్రరావు, కులకర్ణి. బీమ్కూరు, (నిజామాబాద్ జిల్లా).

మీరైతే: మొదటి బహుమతి: బి వి. ఆర్. ఎస్. ఎన్. ఎస్. ప్రసాద్, విశాఖపట్టణం; రెండవ బహుమతి: 'రేమిళ్ళ' హైదరాబాద్: మూడవ బహుమతి: వి. చక్రధర్, కనిగిరి, (ప్రకాశం జిల్లా).

భావపరిచయపోటీ: మొదటి బహుమతి: రూప్సీరామ్. పలాస, (శ్రీకాకుళం జిల్లా): రెండవ బహుమతి: లంక ఫణీందర్, తుంగభద్రాడామ్, (కర్ణాటక): మూడవ బహుమతి: బత్తుల గోవిందరావు, మతం స పల్లి, (శ్రీకాకుళం జిల్లా).

## మంచులో గడ్డకట్టిన ప్రా పూర్తిగా తేరుకున్నాడు



రెండు సంవత్సరాల వయస్సుగల ట్రాకీ మిల్‌వాకీ (అమెరికా) లో తన దగ్గర జనవరి 19 వ తేదీన చలి విపరీ (-29°C) ఉండగా బయట ఆడుకుంటూ కట్టుకుపోయాడు. ఈ బాలుణ్ణి మిల్‌వాకీ ఆసుపత్రికితీసుకు వెడితే వైద్యశాస్త్ర మర నట్టు నిర్ధారించారు. శరీరంలో తగిన వేడి దానికి ఇతణ్ణి హార్టు లంగ్ మెషీనుకు తగి టిస్యూలు వ్యాకోచంచెందడానికి చేత కాళ్ళకునాట్లువేశారు. ఇప్పుడు ఇతడు పూ తేరుకున్నాడు మంచులోఆడుకుంటున్న ఇతని శరీరంలో ఉష్ణం -25.5°C. చరిత్ర ప్రకారం శరీరంలో ఈ ఉష్ణో దగ్గర ఇంతవరకు బ్రతికిన వారెవ్వరూ

'చిత్తము నిర్మలమైన దుఃఖములన్నియును నశించును.' —గీత